# ప్రియదర్శిక నాటిక

## ఈనాటకమునందు వచ్చు పాత్రములు

1. సూత్రధారుఁడు.

2. వత్సరాజు — పేరు ఉదయనుఁడు కథానాయకుడు.

3. విదూషకుడు — పేరు వసంతకుఁడు.

4. విజయసేనుఁడు — వత్సరాజసేనాని.

5. కంచుకి — వాసవదత్త పినతల్లి పెనిమిటియు, నంగరాజ్యాధిపతియు, ప్రియదర్శిక తండ్రియునగు దృఢవర్మని వృద్ధకంచుకి — పేరు వినయవసుఁడు.

6. వాసవదత్త — వత్సరాజు నగ్రమహిషి.

7. సాంకృత్యాయని — ఒక పరివ్రాజిక. వాసవదత్త కాప్తురాలు.

8. కాంచనమాల — వాసవదత్త చెలికత్తె.

9. ఇందీవరిక — వాసవదత్త పరిచారిక.

10. ప్రియదర్శిక — వాసవదత్త పినతల్లికూతురు - కథానాయిక.

11. ఆరణ్యక — ప్రియదర్శిక ప్రచ్ఛన్నముగానున్నప్పటి మారుపేరు.

12. ప్రతీహారి — వత్సరాజు ద్వారపాలిక - పేరు యశోధర.

# ప్రియదర్శికా కథా సంగ్రహము



ఒకకాలములో భరతఖండమున నుదయనుండను నొక మహారాజు వత్సరాజ్యం బేలుచుండెను. ఆతఁడు శౌర్యధైర్యాద్యుదారగుణధుర్యుండగుటయే కాక నిఖిల విద్యావిశారదుండును సకలకలాపారీణుండును నై యఖిల భారతీయ రాజన్య మండల మండనాయమానుండై కౌశాంబీ నగరమును దనరాజధానిగాఁ జేసికొని ప్రజాపాలనం బొనర్చుచుండె. ఆకాలంబునఁ జండమహాసేనుండను నొక మహారాజు ఉజ్జయినీ పట్టణమును దన రాజధానిగా జేసికొని యవంతీ రాజ్యమేలుచుండెను. చండమహాసేనుడు వత్సరాజు దనకుం గొండొక యవజ్ఞ సేసిన నాతనిం గయ్యంబున బద్ధునింజేసి యుజ్జయినిలోఁ గారాగారంబున వైచెను. కానివత్సరాజు సంగీత విద్యావిశారదుండగుటంజేసి, యుదాత్తగుణ శీలయగు వాసవదత్త యను తనకూతునకు నిగళబద్ధుండగు నుదయనుని చేతనే గానవిద్య నేర్పించుచుండెను. సంగీతవిద్యా ప్రవీణత యందేకాక, ధైర్య సాహసంబులందుఁ గూడ, చండమహాసేను మెప్పువడయుటకుదయనున కొక మహావకాశ మొదవెను. ఒకనాడు నలగిరియను మహాసేనుని భద్రగజము మదమువెంచి, యాలానము పెకలించి విజృంభించిన దానినెవ్వరును బట్టికట్టజాలరైరి ఉదయనుడీ దుష్కరమైన పనిని నిర్వహించి మహాసేను మెప్పువడసెను. అంతనాతఁడు వత్సరాజు వీణావాదన నైపుణ్యముచేఁ దన్ను మెప్పించిన నాతనిం జెఱనుండి వదిలిపెట్టెదనని వాగ్దానము చేసెను. అందుపైన వత్సరాజు సంకెలలు దొలగింపబడి కొలువునకువచ్చి దారువు లంకురింప వీణవాయింపుచుఁ గొలువునున్న వారిం బరవశుల నొనర్చి, వాసవదత్త నపహరించికొని విక్రమము నెరపి కౌశాంబీ నగరముచేరెను.

మహాసేనునిభార్య, అంగారవతి. ఆమెచెలియలి పెనిమిటియగు దృఢవర్మ అంగదేశమునకు రాజయియుండెను. ఆయనకుం బ్రియదర్శికయను నొక కూతురుండెను. ఆపెందనకిమ్మని కళింగరాజు ప్రార్థించినను ఆతని కీనొల్లక, వత్సరాజున కీనిశ్చయించెను. కళింగరాజందునకుం గోపించి యప్పటికి వత్సరాజు ఉజ్జయినిలోఁ జెఱనుండుటంజేసి లబ్ధావకాశుండై దృఢవర్మునిపై దాడివెడలి యాతని రణరంగంబున బద్ధునింజేసి తెచ్చి తనవీటకారాగృహమున నుంచెను. వినయవసుండను దృఢవర్మ వృద్ధకంచుకి యొకండు ప్రియదర్శిక నాయుద్ధసంక్షోభముననుండి తొలంగం గొంపో

ఝి యప్పటికి వాసవదత్తాపహరణ మొనర్చి సురక్షితముగా గౌశాంబీనగరమును జేరియున్న వత్సరాజును కర్పించు బుద్ధితో బయలువెడలి, ఒకనాడు మార్గమధ్యమున వింధ్యాద్రిపై దృఢవర్మని మిత్రుడగు వింధ్యకేతుండను నాటవికరాజు వీటవిడిసెను. ప్రియదర్శికను వింధ్యకేతుని కేతనంబున నిల్పి, వినయవసుండనతిదూరంబున నున్న యగస్త్యతీర్థంబునకు స్నానార్థమరిగెను. ఆతండు మఱలి వచ్చునంతకు, వత్సరాజ సేనానియగు విజయసేనుడు తమవైరియగు వింధ్యకేతుని సాధింప బలంబులతో వాని వీటికేతెంచి వింధ్యకేతుం దునుమాడి, యాతని యాస్థానంబునేగాక వింధ్యశిఖరాశ్రితంబులగు జనపదంబులనెల్ల దగ్ధంబులును నిర్మానుష్యంబులునుఁజేసి, పోవునెడ వింధ్యకేతుని కేతనంబునం బిట్టు వగచుచున్న ప్రియదర్శికం గాంచి తత్పుత్రిఁగా నెంచి తోడ్కొనిపోయి వత్సరాజసమ్ముఖమునం బెట్టెను. ఆమహారాజును విజయసేనునివలన వింధ్యకేతుని విక్రమం బెఱింగి, యాతని శౌర్యమగ్గించి, సంజాతస్నేహుండై, యాకన్య నత్యాదరముతో రాజకన్యకోచితంబులగు నృత్తగీతాదులందుం దేఱుగడసేయుమనియు ఈడువచ్చునంతకుఁ దనకుం దెలియనంపుమనియును జెప్పిపుచ్చి వాసవదత్తపాలికం పెను. ప్రియదర్శికయు, వింధ్యకేతుని యాస్థానంబుననుండి వచ్చినది కారణంబుగా నారణ్యికయను పేరువడసి వాసవదత్తయొద్దం బెఱుగుచుండె.

(ఇంతటఁ బ్రథమాంకము ముగియును.)

ప్రియదర్శిక యీడువచ్చునంతకు రూపరేఖా విలాసంబుల నెంతయుం బ్రియదర్శనయై యొప్పుచుండె. అంతనొక్కనాడు వాసవదత్త నియమోపవాసము సేసి యగస్త్యమహర్షికర్ఘ్య మిచ్చుటకుగాను ఆరణ్యిక కమలములను, తనపరిచారికయగు నిందీవరిక శేఫాలికా కుసుమములను, ధారాగృహోద్యానమునకుం బోయి కోసికొని రావలసినదిగా నియమించెను. పూలుగోయుట కారణ్యికేందీవరికలును, విరహవినోదనార్థము రాజును, ఉపవాసాంతమున స్వస్తివాచనముసేయుటకై స్నానార్థము విదూషకుడును ధారాగృహోద్యానమును బ్రవేశించిరి. రాజును విదూషకుడును గలసి ఉద్యానరామణీయకము నభివర్ణించుచు దీర్ఘికచేరు సమయమున నారణ్యిక కమలములఁ గోయుచు వారికంటబడిన రాజాపెయం దనురక్తుఁడయ్యె. రాజును విదూషకుడును పొదమాటున బొంచి చూచుచుండ నారణ్యికముఖమందు తుమ్మెదలు ముసరిన, ఆపె చీకాకుపడి, చెఱఁగున మొగంబు గప్పికొని యవ్వల శేఫాలికా కుసు

మాపచయంబు సేయుచుండిన యిందీవరికకు రమ్ము కావుమని యెలుఁగెత్తి కేకవేసెను విదూషకుని చాటూపదేశంబున రాజయ్యవసరమున పలుకకుండ నారణ్యకచెంతఁజేరి నవాడయ్యె, ఉపదేశము మఱచి.

చ॥ "ప్రకటముఖాబ్జ సౌరభభరంబు తమిన్వడిఁజేరుతుమ్మెదల్
వికచనవోత్పలంబులను లీలహసించు కటాక్షపంక్తు లూ
రకబరగింప బోవుసె స్థిరంబుగ నిల్చెదుఁగాకమోమునం
జకితమృగాక్షి వీడుము విషాదము నేనిదెపాఱదోలెదన్"॥

అని పద్యమును జదువువరకు ఆరణ్యక యాకంఠస్వరమును గుర్తించి మోమున జెఱగు దొలఁగించి, రాజునుజూచి సిగ్గుపడి రక్షింపరమ్మని యిందీవరికంబిల్చెను. అంతట విదూషకుడు సకలభువన త్రాణ సమర్థుండగు వత్సరాజు రక్షణలోనుండియు నీవొరుల రక్షణ నపేక్షింపనేల యని యడుగగా ప్రియదర్శిక తన పార్శ్వచరుఁడగు మోహనాకారుని వత్సరాజుగా నెఱింగి యాతనియందు బద్ధానురాగయయ్యె. ఇట్లురువురు నొండొరులయందు బద్ధానురాగు లగునంతకు నిందీవరిక చేరుటయు, రాజుతొలగి పోదమాటునకేగె. అంత సంధ్యా సమయంబగుటయు, నారణ్యకేందీవరికలు పూలు గొని దేవీ సకాశమున కేగిరి.

(ఇంతట ద్వితీయాంకము ముగియును.)

అట్లొండొరుల నెడబాసి యారణ్యకయు వత్సరాజును విరహవ్యథపాలయి కృశించుచు పరస్పరావలోకన కుతూహలంబు తమచిత్తంబులనుత్తలపెట్టం గొంతకాలము జరుగునంతకు, వత్సరాజు నర్మసఖుడగు విదూషకుడును ఆరణ్యక చెలికత్తెయగు మనోరమయుఁ గూడి యాలోచించి వీరల పునస్సమావేశంబున కొకయుపాయము పన్నిరి. అదియెట్లనిన:—

ఆసమయంబున దేవీ సన్నిధానవర్తిని యగు సాంకృత్యాయనియను నొకపరి ప్రాజిక, యప్పుడు జరుగుచుండిన కౌముదీ మహోత్సవ కాలమున, దేవియొక్కయు ఆమె పరిజనముయొక్కయు వినోదార్థము ప్రదర్శించుట కొకనాటకమును రచియించెను. అందలి కథాంశము వాసవదత్తాపహరణమే. ఆనాటకమున ఆరణ్యక వాసవదత్తవేషమును మనోరమ వత్సరాజువేషమును గైకొన నియమింపబడిరి. అప్రదర్శనము ప్రేక్షాగృహమను పేరఁ బరగు నంతఃపురములోని యొక యంతర్భాగమున

జరుపబడ నేర్పడినది. మనోరమ ఈసందర్భముల నెఱింగినది గావున విదూషకుడు దన్నాలోచన యడిగినప్పుడు ఆప్రదర్శనకాలమునఁ దనకుమారుగా వత్సరాజు స్వయముగావచ్చి కథసాగించినచో నారణ్యికావత్సరాజులకు సమావేశము ఘటించు నని యుపాయము చెప్పెను. విదూషకుండందుల కంగీకరించి నాటక ప్రయోగకాలమునకు రాజునుదోడ్కొని ప్రేక్షాగృహముచేరెను. రాజు రంగము ప్రవేశించెను మనోరమయును విదూషకుడును వెలుపలనిలిచిరి. నాటకము కొంతసాగువరకు అందువత్సరాజు వాసవదత్త వేషమును గైకొనిన యారణ్యికయెడల గనుబఱచిన యాదరము సహింపజాలక వాసవదత్త ప్రేక్షా గృహమువిడిచి పోయెను. కాంతలు కాంతుల యాదరము తమ ప్రతిబింబములపైఁ బ్రసరించుననుఁ జూచిసహింపరుగదా. ఇట్లుపోయి ద్వారమందు విదూషకుడు గుఱుకొని నిద్రించు మండఁ జూచి సంగతిగనుంగొన వాని మేల్కొల్పినవాడు నిద్రకండ్లను దేవినిగుర్తింప నేరక "మారాజు కథ పూర్తిచేసివచ్చి నాడా?" అని యడిగి గుట్టు బైటఁబెట్టెను. వాసవదత్త మనోరమ చిత్రశాలలో నున్నదని విదూషకునివలన నెఱింగినదై యామెనుబిలిచి యెత్తిపొడుపు మాటలాడిన నామె నాయపరాధము నంతయు విదూషకుని నెత్తినిరుద్దెను. దేవి విదూషకుని బంధింపనియమించి మనోరమావిదూషకులతోఁ బ్రేక్షాగృహంబు మఱలఁ బ్రవేశించిన, యెంతయు రసభంగమయ్యెను. సాంకృత్యాయని యడితనకు తావుకాదని యెంచి లేచిపోయెను. రాజుతన యవినయము దెలియుబడెనని యెఱింగి వాసవదత్త నెన్నివిధముల ననునయించినను కలకదేఱక, యారణ్యికనుగూడ బంధింపనియోగించి యచ్చోటు వాసిచనియె.

(ఇంతట తృతీయాంకము ముగియును.)

విదూషకుడు కొంతకాలమునకు విడుదలబడెనుగాని యారణ్యిక చాలకాలము బద్ధయైయుండెను. ఆపె తనబంధముకంటె రాజదర్శన నిస్పృహత్వము, తనహృదయము నెక్కువపీడింపఁ దాలిమిదక్కి యాత్మహత్యకై సమకట్టిన నామె ప్రియసఖియగు మనోరమ యది తెలిసి మాన్పి, విదూషకునిచే రాజున కారణ్యిక ఘోర నిశ్చయమును దెలియపఱచెను. రాజును విదూషకుడును దేవిని ప్రసన్నురాలు గావించి యారణ్యికా విమోచనమునకై యుపాయాన్వేషణము చేయుచుండిరి.

ఇంతలో నంగారవతి యొద్దనుండి యొక జాబుచేరెను. అది యిట్లుండెను,

"నాతోఁ బుట్టువు నీకుం దల్లియే ఆపె భర్త నీకుఁ దండ్రి ఆతండు సంవత్సరమునుండి చెఱ నున్నవాఁడు. ఈసంగతి శూరనరాగ్రేసరుండగు నీభర్తకుం దెలిపి యాతని విడిపింపక యింతయుపేక్షించు టెంతయు ననుచితమని వేఱచెప్పనేల?" ఈవృత్తాంతము దేవికిం దెలుపవలదని రాజానతిచ్చినను నొక పొరబాటువలన దేవికిం దెలిసె, తెలిసినది మొదలు ఆమె దుఃఖసంవిగ్న మానసయై యుండెను. దృఢవర్మని విమోచనంబునకై యాపెయు సాంకృత్యాయనియు జంద్రశాలలో మంతనంబుననుండ రాజును విదూషకానుగతుండై యచటకేగి యనునయాలాపంబుల నామెం బ్రసన్నురాలుగఁ జేయ యత్నించుచుండు నంతకు సాంకృత్యాయని రాజునకామె యప్పటి విచారకారణముయొక్క యాథార్థ్యముం దెలిపెను. రాజును కళింగరాజుపై విజయసేను నంపుటయు నారాజు సైనికపరివార శూన్యుడై తనదుర్గమునదాగి యుండుటయుఁ దెలియపఱచి, అచిరంబుననే వానిపాటును దృఢవర్మని విమోచనమును వినుపించి వాసవదత్తాదేవులకు విందొనర్చెదనని చెప్పెను. రాజు విరమించుతఱికి విజయసేనుడు కళింగరాజునుగూర్చి దృఢవర్మ నంగరాజ్య సింహాసనమున నిల్పి తత్కంచుకియగు వినయవసునితోఁగూడి రాజసమ్ముఖంబు జేరెను. వినయవసుండు విజయసేనుని విజయంబును, కళింగరాజుపాటును, దృఢవర్మ రాజ్యపద ప్రాప్తియుం జెప్పి, దృఢవర్మమాటలుగా మఱికొన్నిమాటలు చెప్పెను, ఎట్లనిన: నారాజ్యవిభవాదులును ప్రాణములు నీవొసంగినవి గాన నీయధీనంబులే నీకీఁదగ్గలంటన మాప్రియదర్శిక తప్పిపోయిన వంత నీవు మావాసవదత్తను బరిణయంబయి చుట్టరికంబు నెఱపినందున గొంతయుపశమించినది. ఈమాటలు విన్నంతనే వాసవదత్తకు దృఢవర్మని విచారమువీడి ప్రియదర్శిక విచారము మరలఁబట్టినది. ఆమెచే నడుగంబడి వినయవసుండు ప్రియదర్శిక వృత్తాంతము దానెఱింగినంతవరకును దెలిపి యటుపై నాపె యేమాయెనో తనకుఁ దెలియదనుచున్నంత. మనోరమ సంభ్రమముతోవచ్చి "పాపమాపె ప్రాణసంశయావస్థలోనున్నది." అని యనుకంపదోపం బలికెను. వాసవదత్త ప్రియదర్శికయాయని యడుగ తానారణ్యిక విషయమై చెప్పితిననియు, ఆరణ్యిక మద్యంబని తెప్పించుకొని విసంబు గ్రోలి యూపిరు దొరగుచున్నదనియుం దెలిపెను. అందుపైన వాసవదత్త హృదయంబున నారణ్యిక విషయమై జనించిన విచారము ప్రియదర్శికనుగూర్చిన విచారమును ముంచి, యతిశయిల్లెను. ఆమె యందుచే మిగుల నాతురయై రాజు విషవైద్యమునం బ్రవీణుడుగాన నారణ్యికను రాజుపాలికి గొనిరమ్మని మనోరమకానతి

చ్చెను. మనోరమ యారణ్యకను గొనివచ్చునంతకు వినయవసుండామెను బ్రియదర్శిక
గా నిరూపించి వాసవదత్త నామెవృత్తాంతమును గూర్చి యడిగెను. ఆమె వింధ్యకేతుని
దుహితయనియు, విజయసేనుడు వింధ్యకేతుం దునిమి యామెం గొనివచ్చెననియు వాస
వదత్త చెప్పిన వినయవసుండు వింధ్యకేతునకుం గూతురులేదనియు, నామె యవశ్యము
ను బ్రియదర్శిక గావలెననియు, నిశ్చయించిచెప్పెను. వాసవదత్తకంత వంతలు రెం
డు నేకమయినందున హృదయమున దుఃఖముంగడలొత్తెను. రాజునుం గర్తవ్యమును
మఱచి వేవిధంబుల విలపింపసాగెను. కొంతవడికి విదూషకుని వచనంబులచే గర్తవ్యం
బు స్మరణకు దెచ్చుకొని రాజు విషచికిత్స చేసి ప్రియదర్శికను జీవింపజేయ, నామె వి
నయవసు మొగంబు గుర్తించి "ఓతాత యోమాత" యని విలపింపదొడంగెను. గాని
వినయవసునిచే వారలక్షేమంబు దెలిసి వెంటనే సంతసంబందెను. వాసవదత్తయు
సంతుష్టాంతరంగయై చెలియలి కంఠంబు గౌగలించుకొని యానందించుచుండ జూ
చి, విదూషకుడు "చెలియలు ప్రాణభయంబునకుం దొలంగెనను సంతోషమున వైద్యు
ని బహుమానము మఱచితివిగదా!" యని యెుగ్గడింప, మఱువలేదు కేలిటుపట్టు
ము అని రాజుతో చెప్పెను. రాజు కేలుసాచుటయు వాసవదత్త చెలియలి కేలందు
గదియింపబోవుడు నాతఁడు "నీయల్క నేటికిగదా మఱల్పగంటిని మఱల కలహంబున
కేలవాయితంబు సేసెదవు" అనుచుండగ కేలు వెనుకకుం దీసెను. అంతవాసవదత్త తన
పరిణయంబునకుం బూర్వమే ప్రియదర్శిక తండ్రిచే వత్సరాజునకుం బ్రతిశ్రుతయై
నసంగతిం దెలిపి రాజు నొడంబఱిచెను ఇట్లు ప్రియదర్శికా వాసవదత్తలు తనకు
దేవేరులయియుండ వత్సరాజు ధర్మము నాల్గుపాదముల నడుపుచు చిరంబు ప్రజాపరి
పాలనం బొనర్చె.

(ఇంతతో జతుర్థాంకంబును సర్వంబును ముగియును.)

# ప్రియదర్శికా నాటిక

## ప్రస్తావన.

చ॥ పరిణయవేళ ధూమమున వ్యాకులమౌ కనుదోయి వే సుధా।
కరకిరణాళిఁ దేర, నిజకాంతుని పైఁ బరగించి, బ్రహ్మముం ।
దరగని మోము వాంచి, నఖదర్పణమందు హరున్ వియద్ధునీ
ధరుగని యల్గి, తత్కరము దాకినఁ జొక్కెడు నద్రిజాతయున్॥

చ॥ గిరి యుసియాడ, గౌరి మెడఁ గ్రేవ కుమారుఁడు (ప్రాక, గుహ్యకుఁడై ।
చరణములూది రావణు రసాతల మంటనడంగ ద్రొక్కుచున్ ।
గిరిసుతకౌఁగిట న్గలుగు నిర్భరసౌఖ్యపయోధిఁ దేలు శం ।
కరుఁడును మీకొసంగుత నఖండ శుభంబులు వేనవేలుగన్॥

(నాందిముగిసెను.)

సూత్రధారుడు. (పరిక్రమించి) నానాదిగ్దేశాగతులయి, శ్రీహర్షదేవ పాద పద్మసేవానిరతులయి, కొలువునసున్న రాజసమూహము నన్ని వసంతోత్సవ దినమున సబహుమానంబుగా రావించి, "అపూర్వకథాకల్పనాలంకృతంబై ప్రియదర్శిక యను నొక నాటకము మనప్రభువగు శ్రీహర్షదేవునిచే రచింపబడెనని కర్ణాకర్ణికగా వినుటయే గాని ప్రదర్శింపఁగాఁ గనుటలేదు. అయ్యది సర్వజన హృదయరంజనాచణుండగు ప్రభువునెడఁ గల గౌరవముచేనొండె, మాయందలి యనుగ్రహబుద్ధిచేనొండె యథావిధిగాఁ బ్రయోగింప వేడుచున్నారము" అని యానతిచ్చిరి. కావున నైపథ్యసన్నాహ మొనర్చి వారియభిలషితంబు నెరవేర్చెదను. (చుట్టును జూచి) సామాజికుల చిత్తవృత్తులు సావధానములై యున్నట్లు దోచుచున్నయవి. ఏలయన,

మ॥ నిపుణుండౌ కవి హర్షుఁ డీసభికులెంతే శేముషీభాసితుల్;
నృపచూడామణి వత్సభూవరుఁడు; తద్వృత్తంబు హృద్యంబు; నా
ట్యపు శిల్పంబున మేము దక్షులము; మభీష్టార్థాప్తి కొండొండు ము
ఖ్యపదంబిందు; గుణంబులన్నియును భాగ్యాయత్తమై చేకురెన్॥

(తెరవంకఁజూచి) బాపురే! నేను బ్రస్తావనకై సన్నాహ మొనర్చుచుండఁ జూచి, మదీయాభిప్రాయంబు గ్రహించి యల్లదె నాచెలికాడంగాధీశుడగు దృఢవర్మని కంచుకివేషముం గైకొని యిట్లువచ్చుచున్నాడు. నేనుంబోయి యనంతర భూమిక స్వీకరించి యేతెంచెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రస్తావన ముగిసినది.

---

## ప్ర థ మాం క ము

కంచుకి ప్రవేశించుచున్నాఁడు.

కంచుకి. (శోకశ్రమము లభినయించుచు నిట్టూర్పు నిగిడ్చి) అకటకటా!

మ॥ బరువైతోఁచెడు దీర్ఘజీవితపు బల్పాట్లెల్ల వాటిల్లె, భూ
వరుకారాగృహ బంధనంబుఁ బరమాప్తత్యాగ దుఃఖంబు, దు
ర్భరదేశచ్యుతి, శైలదుర్గమమహారణ్యాధ్వఖేదంబు; బం
ధురమైడాసెడు పూర్వకర్మఫలము ల్దోడ్పవన్వశంబేయిలన్ ॥

(శోకవిస్మయములు నటించుచు) బ్రార్థితుండయ్యును గూతుం దనకియ్యనియ్యకొనమి కింగినిసి, వత్సరాజు నిగళబద్ధుండగుటంజేసి లబ్ధావకాశుండై, బలంబులం గూర్చికొనివచ్చి, యొక్కుమ్మడిం జుట్టుముట్టి సైన్యంబులం జీకాకుపఱచి, యాకళింగ నృపాధముండు, అప్రతిహతశక్తిత్రయోపేతుండును రఘుదిలీప నలనహుష్ప్రతిముండును నై ప్రశస్తిగాంచిన మాదృఢవర్మ మహారాజునకుంజేసిన యుపప్లవంబు గన్నులారం జూచిన దయ్యో నాకుంగిలగాఁదోఁచెడిని. ఆహా! దైవమింత నిర్దయుండగునే; గోటుచుట్టుపై రోఁకటిపోటునుంబోలె నాపదలమీఁద నాపదలు ఘటిల్లుచున్నయవి. ప్రభుపుత్రికయగు ప్రియదర్శిక నేయుపాయంబుననైన వత్సరాజ సకాశంబుసేర్చి,యామె నానృపునకర్పించి, మానృపుని ఋణంబు వాపికొనంగడంగి, ప్రళయకాల దారుణంబగునా రణసమ్మర్దంబుననుండి బహుప్రయాసచే నామెనవ్వలికిం గొంపోయి, కౌశాంబీనగరమున కేగుచోడ మార్గవశమున మారాజునెచ్చెలియగు వింధ్యకేతుఁడను నాటవికరాజు గృహంబున విడిసి, యామెనటనిల్పి, నేనతిమారంబుననున్న యగస్త్యతీర్థంబుననుు

స్నానార్థంబరిగి మఱిలునంతకు, నెవ్వరో రాక్షసకల్పులగు వైరులదరిపాటునఁదాఁకి సైనికులఁజెండాడి విన్ధ్యకేతుం దునుమాడిపోయిరి. దగ్ధంబై నిర్మానుషంబైయున్న యిచ్చో నెచ్చట వెదకినను రాజపుత్రిం గాన నేరమి, నా పెయి దగ్ధయయ్యెనో వైరులచేఁజిక్కెనో మరియేమాయెనో యని నామనంబు పరిపరివిధములఁ జిక్కువడుచున్న యది. ఎంతమందభాగ్యుఁడనైతిని? హా! నేనేమిసేయువాఁడ? (ఆలోచించి) ఆహా! కారాగారమునుండి వెల్వడి వాసవదత్తాపహరణం బొనర్చి వత్సరాజు కౌశాంబీనగరమున కేగెననివింటిని. ఆతని సమ్ముఖంబునకుం బోవుదునా? (నిట్టూర్పుతోఁ దనయవస్థను స్మరించుకొనుచు) అక్కటా! రాజపుత్రిం దోడ్కొనక యటకేగి యా నృపశేఖరున కేమిచెప్పువాఁడ? ఓహో! మరియొకసంగతి స్మరణకువచ్చినది. "గాఢపరిహార జర్జరీకృత శరీరుండయ్యు దృఢవర్మమహారాజు సజీవుడై కారాగృహంబున నున్నవాఁడు" అనియింతకుమున్ చేకదా విన్ధ్యకేతుఁడు చెప్పినాఁడు. కావున నేనుమత్ప్రభుసన్నిధికేగని తచ్చరణసేవ నాయాయుశ్శేషంబు సఫలం బొనర్చికొనియెద. (పరిక్రమించి యూర్ధ్వమునఁజూచి) ఆహా! శరదాతపమెంత దారుణముగానున్నది. ఇట్లనేక దుఃఖసంతప్తుండనగు నన్నుంగూడఁ గడుందపింపఁజేయుచున్నయది.

క॥ ఘనబంధ విముక్తుండయి,
ఘనతేజస్స్ఫూర్తిమించి, కన్యావాప్తిం
దనరి,తులమించి, యెంతయు
నినుఁడు వెలింగెడును వత్సనృపుచందమునన్॥

(నిష్క్రమించుచున్నాఁడు)

శుద్ధ విష్కంభకము ముగిసెను.

(వత్సరాజును విదూషకుఁడును బ్రవేశించుచున్నారు.)

రా. చ॥ తెలిసెనమాత్యశేఖరుల తెల్విసుహృజ్జన గాఢరాగముం,
దెలిసెను భృత్యవర్గసముదీర్ణసువిశ్వసనీయతాదులుం,
దెలిసెను పౌరభక్తి, సమితిన్భుజగర్వమొకింతచూపితిన్,
లలినయుఁజొప్పడె, న్జైజయనైక శుభావహమయ్యె నాకిలన్॥

వి. వయస్యా! నీవేల, యేవేళ; నాపాపపుఁజెఱనే వొగడుచుందువు? ఇంతలో నే మఱచితివా యప్పటి దురవస్థ క్రొత్తగాఁ బట్టువడిన యూథపతి చందంబున

ఖలఖలాయమానలోహ శృంఖలాబద్ధంబులగు చరణంబులు దొట్రువడ, దీనానం బెంత యునంతస్తాపంబుం బైటబెట్ట, లోనంగుమిలెడు కోపభరంబున గన్నులం గెంపుదోప తలమునబండి నిద్రలేక నిశలుగడపుచుంటివే.

రా. వసంతక ! నీవుపామర గ్రామణివిగాన నీబుద్ధి యింతవరకే పో యినది.

సీ॥ చెఱసాలలోపలి చీకటియేకాని కాంతస్మితజ్యోత్స్నఁ గానవీవు ।
నిగళబంధనశబ్ద నిష్ఠురత్వమెగాని చెలియాపల్కులతీపి దెలియవీవు ।
కాపలివారల కఱుకత్తులెకాని కలికివాల్చూపులు గాంచవీవు ।
మనభాగ్య సూర్యాస్తమయమె గాంతువుగాని చెలిమోము జాబిల్లి జెలువుగనవు॥

గీ॥ మనకుఁగల్గినదొసగులె మదిఁదలంతు ।
వింతిసౌభాగ్య మెంచవొక్కింతయైన ।
దోషదృష్టియెకాని ప్రద్యోతపుత్రి ।
గుణముగ్రహియింపనేరవు కొంచెమైన ॥

వి. నిగళబంధనము సుఖబంధనమని యెంతువేని నీవేల దృఢవర్మని బంధన మునకై కళింగునిపై యాగ్రహించెదవు.

రా. ఓరీమూర్ఖ ! ప్రతివాఁడును వత్సరాజగునటరా ? బంధమునుండి బయ లువెడలి వాసవదత్త నపహరించుటకు ? ఈకథయటుండినిమ్ము. వింధ్యకేతునిపై విజ యసేనుఁడు దాడివెడలి బహుకాలమయ్యె నాతనిజాడయే గానరాకున్నయది. అ మాత్యరుమణ్వంతుం బిలువనంపుము. నేనాతనితో నించుక సంభాషింపవలసి యున్నది.

(ప్రతీహారి ప్రవేశించుచున్నది.)

ప్ర. జయముదేవా జయము ! పీరేవిజయసేన రుమణ్వంతుల్ ద్వారదేశమున నున్నవారు.

రా. సత్వరమునఁ గొనిరమ్ము.

ప్ర. మహాప్రసాదము. (నిష్క్రమించుచున్నది.)

విజయసేన రమావృంతులు ప్రవేశించుచున్నారు.

రమ. (ఆలోచించుచు)

ఆ॥ మనసుగలుగఁ గొల్చినవరయైమించు
భృత్యుఁడైన క్షణము వీడెనేని
రాజమందిరమపరాధికైవడిఁ జేరు
నల్లనల్ల శంకితాత్ముఁడగుచు ॥

(సముఖమునజేరి) జయము స్వామీ.

రా. (ఆసనమును నిర్దేశించి) ఇందు గూర్చుండుము.

రమ. (సస్మితముగా) ఇదె వింధ్యకేతుజేత విజయసేనుఁడు నమస్కరించుచున్నాడు. (విజయసేనుఁ డట్లుసేయుచున్నాడు)

రా. (విజయసేనుం గౌగలించి) కుశలమే నీకు?

విజ. దేవర ప్రసాదమున.

రా. సుఖాసీనుఁడవగుము (విజయసేనుఁ డాసీనుఁడగుచున్నాడు).
విజయసేనా వింధ్యకేతుని వృత్తాంత మెట్లున్నది.

విజ. దేవరయాగ్రహ పాత్రులైని వృత్త మెటులుండనోపునో యటుల సేయున్నయది. వేఱచెప్ప నేల ?

రా. అయినను సవిస్తరముగా వినం గౌతూహలం బయ్యెడు వినుపింపుము.

విజ. దేవా యవధరింపుము. దేవరయానఁగైకొని, కరితురగపదాతివర్గంబులతోఁదరలి, సుదూరంబైనను మార్గంబు మూడు దినములలో నిస్తరించి, యొకనాటి యుదయమున నెవ్వరెఱుంగకుండ నదరిపాటున వింధ్యకేతునిపైఁబడితిమి.

రా. తదనంతరము.

విజ. తదనంతరము మాసేనల కలకలముచే మేల్కాని వింధ్యకందరము వెల్వాడి యాకటి పెల్లున నులుకు సింగంబుభంగి, వింధ్యకేతుండ నపేక్షిత బలవాహనుండును కతిపయ పరిజనమాత్ర పరివృతుండునునై వెడలి సింహనాదం బొనర్చుచు మన మూకలపై పెల్లడరిన—

రా. (యమణ్వంతుని దెసజూచి స్మితాననుండై) ఆహా! ఏమీ వింధ్యకేతు నిసంరంభము ఎంతయొప్పుచున్నయది.

విజ. మేమతని నేర్పరించివారమగుటచే, మచ్చరంబు వెంచి, సేనలంబురికొల్పికొని కొల్లలుసేసి, యొక్కపెట్టున సంకులంబుగాఁగవిసి నొప్పించిన నాతండును దండతాడితంబగు భుజంగంబు చందంబున రోషభీషణుండై కటములదరఁ బెదవులు గొఱుకుచు విజృంభించి —

రా. సెబాస్ రా, శూరాగ్రణీ, సెబాస్.

విజ. చ॥ అరినిమిషదాతి పంక్తినురుమాడెనురోషభిహతిన్మహోగ్రుఁడై,
హరిణములట్లనోలె సకలాశ్వికుల న్వియదంతపాళికిం,
బరశుగదాది కోటిఁ బరిమార్చె ననంతచమూసమూహముం,
గరికరకాండకాననవికర్తనకేళికిఁ జొచ్చెనాపయిన్ ॥

క॥ ఈరీతిబలత్రితయము
మారిమసఁగి మాంసలాంసమధ్యార్పితమా
కూరిరాసి వెలుంగగనా
శూరుఁడు శరవిద్ధుడగుచు సోలెంధరపై ॥

రా. అమాత్యశేఖరా! వీరవరోచిత మార్గానుయాయియగు వింధ్యకేతుని మరణము మాకెంతయు ప్రీడావహముగానున్నది.

రుమ. దేవా మీబోటి గుణపక్షపాతులకు రిపులయందలిదైనను, గుణసంపత్తి ప్రీతిజనకమే యగుచుండును.

రా. మంత్రిపుంగవా! మిథ్యా ప్రియవచనంబుల నేమి ప్రయోజనము (విజయసేను దెస) విజయసేనా! వింధ్యకేతున కపత్యముండినచో నరసిచెప్పుము మా పక్షపాత ఫలంబునకుం బాత్రంబుసేసెద.

వి. దేవా యదియొచుం జెప్పెదనవధరింపుము. ఇట్లుసబంధుపరివారుండై వింధ్యకేతుండు పడుటయు, నతని సహధర్మచారిణులందరుం బతివెంట నంటుటయు వింధ్యశిఖరాశ్రితంబులగు జనపదంబులెల్ల దగ్ధంబులును నిర్మానుష్యంబులు నగుటయు

"ఓమాత యోతాత" యని వింధ్యకేతు నాస్థానంబునం బెల్లుదురపిల్లు నొక కన్యారత్నంబుం గాంచి, నభిజాతరూపయగుటం దత్పుత్రిగా నెంచి, దేవరసకాశంబు గొనివచ్చితిమి. అమె ద్వారదేశంబున నున్నయది. ఆపైనదేవర చిత్తము.

రా. యశోధరా, నీవా పెందోడ్కొనిపోయి వాసవదత్తకర్పించి "భగినీబుద్ధిఁజూచుచు, నీమెను నృత్తగీతాది విశిష్టకన్యకోచిత విద్యలందేలునట్లు సేసి, పరిణయయోగ్యయగువంతకు మాకుం దెలియపఱుపు" మని నామాటగా నీవామెకుం జెప్పుము.

ప్రతీహారి. దేవరచిత్తము (నిష్క్రమించుచున్నది)

(తెఱలో వైతాళికుడు.)

మ॥ జలకంబాడఁగ హేమకుంభములతో స్వచ్ఛాంబువుల్వింతలా
కలపంబుల్వెసఁగూర్చి క్లాంతిపశతన్గా శైయ చేలాంచలం
బులు జాఱన్బయికెత్తినట్టి కనకంపుం గిండ్లునా జన్గవల్
వెలువడ్డం బసమించిరంగనలు పృథ్వీనాథస్నానావనిన్॥

రా. (పైఁజూచి) ఓహో! సహస్రాంశుఁడు నభోమధ్యంబు నలంకరించి వెలుంగుచుండెడిని.

చ॥ జలములఁదాఁటు మీనముల సందడిదీర్ఘికలెండ వేఁడిమి
న్నళిసలఁ గ్రాఁగునట్టుల గనంబడు; బింబము గోడ్డువోలె నా
దలపయి విప్పె నెమ్మి యదె; దంతికటంబులు వీడిపట్టుపదం
బులు చెవిక్రిందుఁజేరె; దరు మూలజలంబుఁ గురంగశాబముల్॥

మంత్రిపుంగవా, యింకం గొలువు చాలించి యభ్యంతరశాలఁ బ్రవేశించి, యుచితక్రియలుదీర్చి, విజయసేను సముచితభంగిం బహూకరించి, కళింగహాతకుని పయిం బంపుదము. (అందఱు నిష్క్రమించుచున్నారు)

ప్రథమాంకము ముగిసినది.

# ద్వితీయాంకము

(విదూషకుడు ప్రవేశించుచున్నాడు.)

వి. ఓవసంతక! "యీదినముపవాస నియమము నెఱపి వాసవదత్త స్వస్తి వాచనార్థము విప్రులకై( బిలువనంపుచున్నది." అని యిందీవరికవలన వింటిని. కావున ధారాగృహోద్యాన దీర్ఘికయందు స్నానముసేసి దేవీపార్శ్వమున( జేరి దంభచర్యనవలంబించి పెదవులుగదపుచు నిలిచెదను. ఇట్లు గానిచో నాబోంట్లకు రాజమందిరముల( బ్రతిగ్రహములభించుటెట్లు? (తెరవంక(జూచి) ఓహో! దేవీవిరహవినోదనార్థము నాప్రియవయస్యు(డు గూడ నీధారాగృహోద్యానమునకే విచ్చుచున్నాడు. కాన నేనాతని తోడనేయేగి నాకార్యము నెరవేర్చికొనియెదను.

(రాజు సోత్కంఠుడై ప్రవేశించుచున్నాడు.)

రా. చ॥ చెలినియమోపవాసమున( జిక్కినదై యసమగ్రలీలభూ
షల(గయిసేసి సన్నిసచస్ఫురణం గరమొప్పి; వేకువ
న్వెలవెల( బారుచందురుని వేహసియించెడు మోముకాంతితో
చాలివిరహంపు చిన్నెలను దోప(గ(జేయు మనోహరంబుగన్॥

వి. (చేరవరిగి) మంగళము నీకు వయస్యా.

రా. (చూచి) వసంతక నీమొగమున సంతోషము( దోచుచున్నయది. ఏమికారణము.

వి. దేవి యీపొద్దు బ్రాహ్మణపూజ సేయనుండుట యెఱుంగవా

రా. అట్లైన నీకేమి ప్రయోజనము?

వి. (సగర్వముగా) చతుర్వేద పంచవేద షడ్వేద పారంగతులగు బ్రాహ్మణులు వేవురుండిరను ప్రథమమున దేవి నావలన స్వస్తివాచనము గైకొనినున్నది. నేను గదా బ్రాహ్మణులలో నెల్ల బ్రాహ్మణు(డను.

రా. (నవ్వి) నీవేగసంఖ్యయే నీబ్రాహ్మణోత్కర్షను బోధించుచున్నయది. కాన నోమహాబ్రాహ్మణా, లెమ్ము ధారాగృహోద్యానవనమునకు పోవుదము.

వి. నీచిత్తము చొప్పు.

రా. నీవుముందు నడువుము.

వి. రమ్ము పోదము (పరిక్రమించి చూచి) వయస్యా, చూడుము చూడుము. అవిరతపతద్వివిధ కుసుమ సుకుమారశిలాతలోత్సంగంబును, పరిమలనిలీన మధుకరభరభగ్న వకులమాలతీలతాజాలకంబును, కమలగంధవహామోద్దామమారుతప్రతిబుద్ధ బంధూకబంధనంబును, అవిరలతమాలతరుపిహితాతపప్రకాశంబును, నైయొప్పు ధారాగృహోద్యాన శోభావిలసనంబమందానంద సంధాయకంబై యొప్పుచున్నయది.

రా. వయస్యా బాగుగ వర్ణించితివి.

మ॥ చిగురుల్ సజ్జయుఁబోలె నొప్పుభువి యీ శేఫాలికావృంతసం
స్థగితంబై, యలదానగంధ మొలయున్ సప్తచ్ఛదశ్రేణుల
న్నిగులన్ విచ్చిన తమ్మిమొత్తములలో నిండారు పుష్పాళ్లు మా
లఁగఁ బూదేనియలాని మత్తిలియళుల్గానంబుల న్మించెడున్॥

వి. వయస్యా, ఈయేడాకుల యనంటింజూడుము. ఇందుండి యెడతెగ కరాలు కుసుమ నికరంబు వర్షావసాన సమయంబునం దన యగ్రపత్రంబులనుండి చిటపొటం దొరఁగుజలబిందు సందోహంబు ననుకరించుచున్నయది.

రా. బాగుఁగఁ గని పెట్టితివి. వయస్యా, ఈతావున,

చ॥ సదమలగారడాశ్మసువిశాల వినిర్మితకుట్టిమస్థలుల్
మృదులశిరీష శోభహసియించెడు శాద్వలలీలఁబొల్చెడుం
బదపడి బంధుజీవ కుసుమంబులురాలగ నిందగోపము
ల్గదిసినయట్లులై జలదకాలములీలయె విల్చునిచ్చలున్॥

(చేటి ప్రవేశించుచున్నది.)

చే. "ఓసీ, యిందీవరికా, నేనగస్త్య మహామునికర్ఘ్య మీవలసియున్నది. నీవు శేఫాలికా కుసుమములు గోసికొనిరమ్ము. ఈయారణ్యక యుధారాగృహోద్యానదీర్ఘికనుఁబోయి యినుడస్తాద్రికి జాఱఁబోవ నవి ముకుళింపకమున్న కొన్ని కమలంబులం గోసికొనివచ్చెదగాక" యని దేవి యానతిచ్చినది. పాపమీయారణ్యక యుద్యాన దీర్ఘికం దెరు వెఱుంగదు, నేనాపెను నాతోడం గొనిపోయెదను. (తెరవంకఁజూచి) ఆరణ్యకా యిటురమ్ము.

(ఆరణ్యిక ప్రవేశించుచున్నది.)

ఆ. (కన్నీరు నించుచు (స్వగతముగా) అట్టివంశమునఁబుట్టి దాసదాసీజనం బుల నాకనుసన్నల గొలువనియమించుచుండిన నాకు నన్యుల యాజ్ఞలొనర్పవలసె నక్కటా! విధి కసాధ్యముండునే హా! ఏమిటికీభ్రమ? అంతయుందెలిసియుం బ్రాణంబులు డాచికొనుచుం గాలంబుగడుపు నన్ను నుకొనవలెంగాని విధిదూరనేల? నాకీయవస్థలో నేమిచేయుటకుం దోచకున్నయది. కర్తవ్యవిముఖంగమిం దలంపులు ఘోరకృత్యంబులకుం గిఱకించుచున్నవి. ఒకటిమాత్రము కీడులో మేలొనర్చితిని మహోగ్ఘుమగు నావంశమును మాత్రము బ్రకాశముసేసి చుల్కనచేయలేదు. దేవ్యాజ్ఞ నెరవేర్చెదను. నెరవేర్చుక తీరుటెట్లు?

చే. ఆరణ్యికా, యిటురమ్ము.

ఆ. ఇదెవచ్చుచున్నదాన (శ్రమమభినయించుచు) దీర్ఘిక చాలదూరమా చెలీ?

చే. ఇదె శేఫాలికా గుల్మాంతరితమై మనకట్టెదుటం గన్పట్టుచున్నది. దిగుదమురమ్ము.

(అవతరణ మభినయించుచున్నారు.)

రా. వయస్య, నీవేమి యన్యచింత నున్నట్లు గనంబడుచున్నాడవు? యీ తావున జలదసమయ లక్షణములు నిచ్చలుందోచుచుండెడునని యంటిని వింటివా?

చ॥ సదమలగారు డాశ్మసు విశాల వినిర్మిత కుట్టిమస్థలుల్
మృదులశిరీష శోభహాసియించెడు శాద్వలలీల బొల్చెడుం
బదపడి బంధుజీవకుసుమంబులు రాలగ నిందగోపము
ల్గడిసినయట్టులై జలదకాలములీలయె నిల్చునిచ్చలున్॥

వి. (కోపముతో) ఓయి, నీవిదియు నదియుఁ బరికించుచు నుత్కంఠితమైన నీహృదయంబునకు వినోదమొనర్చుకొనుచుందువు. నాకేల బోడిశాపనకీగోడు? స్వస్తివాచనవేళ 'యతిక్రమించెడిని. ఇంకందడవుసేయక దీర్ఘికకుఁబోయి యందు మునిగి దేవీసకాశమున కేగెదను.

రా. ఓరీమూర్ఖ, మనము దీర్ఘికతీరదేశముననే యున్నారము. తన్మాలిక

ముగనగు న నేకేంద్రియ సుఖ మనుభవించుచుండియు దానినుపలక్షింపవు. ఇంచుక మనమిటనిల్వ మంతయు గోచరించెడిని.

చ॥ ప్రియసఖి నూపురధ్వనుల వీనులవిందగునంచ యెల్లలు,
న్నయన సుఖంబుగాను పవనంబున కవ్వలఁదోచు సౌధముల్,
పయికొని వీచుచో కొలనిపద్మ సుగంధము వారిశైత్యముం,
గయికొని ఘ్రాణతృప్తియును గాత్రసుఖం బొనరించువాయువుల్॥

చేరఁబోవుదము రమ్ము (పరికించిచూచి) వయస్యా, చూడుము,

గీ॥ అమలకమల కాంతిహారినిర్మలమింపి
తేరి నిర్మలమగు దీర్ఘికయిది
యుచితవేషమెనయు నుద్యానదేవత
దృష్టిలీలఁ బొల్పి తేజరిల్లు॥

వి. (కౌతుకముతో) వయస్యా, చూడుమిటు; కుసుమపరిమళ సుగంధి వేణీ మధుకరావళియు, విద్రుమ లతారుణహస్తపల్లవయు నుజ్జ్వలత్తనుకోమల బాహాలతయునై సాక్షాత్కరించిన యుద్యానదేవతవోలె నొక స్త్రీ సంచరించుచున్నయది.

రా. (కౌతుకముతో నవలోకించి) వయస్యా ఈమె నిరతిశయ రూపరేఖా విలాసము లనేక వికల్పముల కాస్పద మొసంగుచున్నవే కాని నిశ్చయము దోచకున్నయది.

ఉ॥ భోగవతిం ద్యజించి మన భూమిగనుంగొన లీలఁ జేరెడు
న్నాగవధూ లలామయగు; నాగులకిక్కడి వీవిలాసముల్?
కాగలదౌరమూర్తమగు కౌముది; కౌముది దోచునే పవ
ల్బీగతి? పద్మహస్తయై హేలఁ జరించెడు లక్ష్మిగావలెన్॥

వి. ఇదె దేవీ పరిచారిక యిందీవరిక యిటు వచ్చుచున్నది. ఈపొదచాటున నొదిగి చూతము.

ఉభయులునట్లు చేయుచున్నారు.

చేటి. (తామరాకు గోయుట నటించుచు) ఆరణ్యకా, నీవుకమలములఁ గోయుము. నేనీనలినీపత్రముతో శేఫాలికా కుసుమములు నించి దేవీ సకాశమున కేగెదను.

రా. వయస్యా, మాటలు వినవచ్చుచున్నవి. యవహితులమై వింధుమేని సందర్భమెల్ల విశదము కావచ్చును.

చేటి. (గమనము నటించుచున్నది)

ఆర. చెలీ యిందీవరికా; నిన్నువీడి యిట నిముసమైన నిలువనోప.

చే. (నవ్వుచు) నేను దేవివలన విన్నదానింబట్టి చూడఁగా నీవునన్ను చిర కాలము వీడియుండవలయునట్లే యూహింప వలసియున్నది.

ఆ. దేవి యాలోచనయేమి ?

చే. ఆపెమాటలే చెప్పెదవినుము: — 'ఈవింధ్యకేతుని దుహిత పరిణయ యోగ్యయగునంతకు మాకుం దెలుపుము' అనిగదా మహారాజు సెలవు. కావున నేనీ పెసంగతి యాయన జ్ఞప్తికిఁ దెచ్చెదను. మహారాజును అనురూపవరునరయు ను ద్యమమునన్నుండు గాక.

రా. (హర్షముతో) ఈమె యిల్ల వింధ్యకేతు దుహితయా? మనమింత సేపు మోసపోతిమి. వయస్యా! ఈపెకన్యయగుట న్దర్శనంబున దోషంబువొరయదు కావున శంకదక్కి కన్నులారఁ జూతము.

ఆ. (రోషముతో) అట్లయినం బొమ్ము. అసంబద్ధ ప్రలాపినివగు నీతో నాకుం బనిలేదు.

చే. (తొలగిపోయి కుసుమాపచయంబు నటించుచున్నది).

రా. ఆహా! చూచితివా వయస్యా, ఈధీరత్వమే యాపె యాభిజాత్యము ను బ్రకటించుచున్నయది. ఆహా! ఈమె యంగస్పర్శ సుఖ భాజనంబుగాఁగల ధన్యునిడిగదా భాగ్యము.

ఆ. (కమలాపచయము నటించుచున్నది.)

వి. ఆశ్చర్య మాశ్చర్యము; చూడుము చూడుమో వయస్యా! ఈపెనీటం జలించుచు సనాళ కమలంబులంబోలు తన కరతలంబుల కాంతిచే కమలింబుల నవ హసించుచున్నయది.

రా. అందలి సారస్యము నీవేమి గ్రహించితివి ?

చ॥ అమృతపుసోనఁబోలె ననయంబును గన్నులఁజల్లఁజేయుచుక్,
శ్రీమవశతం బయోధర భరచ్ఛదనిర్గతి దర్శనీయమై,
యమల సుధాంశుఁబోలు విమలాంగి కరంబులు సోకనబ్జము,
ల్దమమొగము ల్మాగుడ్పమి దలంచిన విస్మయమయ్యెడుంగడుక్॥

ఆర. అయ్యో! ఈదుష్టమధుకరములు కమల నీలోత్పల వనముల విడనాడి నామొగంబు పయింగవిసి నాయాయాసంబు రెట్టించుచున్నయవి. (చెరంగున మొగంబుగప్పి భయంబుతో) చెలీ యిందీవరికా, కావుము కావు మీదుష్ట మధుకరంబులు నన్నుం జీకాకు పఱుచుచున్నయవి.

వి. ఓవయస్యా, నీమనోరథములు ఫలించినవి. ఆరాణికూతురు రాక పూర్వమే నీవు మిన్నక యామెచెంతఁజేరుము. ఆమె సలిలసంచలనముచే పదముల జాడ నూహింప వలసినది గావున నిందీవరిక చేరివచ్చుచున్నదని యెంచి నిమం గౌఁగలించెడును.

రా. భళీ! ఎమి చతురముగాఁ జెప్పితివి. నీపల్కుల సమయానుకూలత యెంత యను చెప్పెడిని.

(అని యారణ్యిక చెంతకుఁజేరుచున్నాడు)

రా. (కంఠమునఁ గౌగలించుచున్నాడు)

ఆర. (మొగమునుండి చెఱంగు దొలంగఁదోసి రాజును జూడకయే భ్రమరావలోకనము నటించుచున్నది).

రా. (తన యుత్తరీయముతో భ్రమరముల దొలఁగదోలుచు)

ఉ॥ ప్రకట ముఖాబ్జ సౌరభ భరంబు తమిన్వడిఁ జేరుతు మ్మెదల్
వికచనవోత్పలంబులను లీలహసింపఁ గటాక్షపంక్తులూ
రకపరగింపఁబోవు నె స్థిరంబుగ నిల్చెడుగాక మోమునం
జకితమ్ము గాక్షి వీడుము విషాదము, నేనిదె పాఱఁదోలెగన్॥

ఆ. (సిగ్గభినయించుచు) ఏమీ, యిందీవరిక గాదా? (లజ్జతో రాజునుండి తొలఁగి) ఇందీవరికా, సత్వరమున వచ్చినన్ను రక్షింపుము,

వి. ఓమానవతీ, సకలభువన పరిత్రాణ సమర్థుండగు వత్సరాజుచే రక్షింప

బడుమండియు చెలికత్తెకై యేలయెలుగెత్తెదవు ?

రా. విలాసిని,

చ॥ ప్రకట ముఖాబ్జ సౌరభ భరంబుత మిన్వడిఁజేరుతుమ్మెదల్
వికచన వోత్పలంబులను లీలహసించుఁ గటాక్షసంక్తులా
రక బరగింపఁబోవుసె స్థిరంబుగ నిల్చెదు గాక మోమునం
జకిత మృగాక్షి వీడుము విషాదము, నేనిదె పొఱఁదోలెదన్॥

ఆ. (రాజు నవలోకించి లజ్జానురాగంబులు దోపఁ దనలో) మాతండ్రి నన్నీదలంచిన మహారాజీ రాజసింహుఁడా ? అట్లయిన నాయన పక్షపాత మర్హస్థానమున నే దగిలినది. (ఆకులపాటు నటించుచున్నది).

చే. ఆరణ్యిక దుష్ట మధుకరములచే నలయింపఁబడుచున్నది గదా; నేఁబోయి యూరార్చెద. ఆరణ్యికా వెఱవకుము. ఇదె వచ్చుచున్నదాన.

వి. ఓయి, తొలంగుము తొలంగుము. ఇందీవరిక వచ్చుచున్నయది. కనులంబడిన నీవృత్తాంతము దేవికి విన్నవించెడు గాన నీకదళీ గృహాభ్యంతరమున నే యుండుదము. (ఉభయులును సంభ్రమముతోఁ దొలంగుచున్నారు)

చే. (చెంతఁజేరి) ఆరణ్యికా కమల సదృశంబులగు నీమోమువలని దోసంబున నీమధుకరములిట్టి యపరాధమునకుఁ బాల్పడ్డినవి. రమ్ముపోదము. పొద్దు గ్రుంకనున్నది. (గమనమును నటించుచున్నారు.)

ఆ. (కదళీగృహముదెస విలోకించి) అతిశిశిర సలిలసంస్పర్శచే నాకూరుకంపమొందవినది. మెల్లమెల్ల నడువుము.

చే. ఆలాగే (ఉభయులును నిష్క్రమించుచున్నారు)

రా. ఏమి నయన పథమతిక్రమించినదా? (నిట్టూర్పునిగుడించి) వెచ్చేరీ భాగ్యహీనుల యభిలషితంబు లంతరాయంబులు లేక సఫలంబులుగా నోపునా. (విలోకించి) వయస్యా చూడుము చూడుము.

తే॥ కన్నుదమ్ముల నరమోడ్చి కంటకితమ్ము
గాగ నొప్పారు నీయబ్జ కాననంబు
చెలియకర పల్లవ స్పర్శ చేతఁజొక్కి
యతుల సౌఖ్య పయోరాశియందుఁదేలు॥

(నిట్టూర్పు నిగుడించి) ఆపెను మఱలఁజూడ నుపాయంబేద్ది ?

వి. బొమ్మను బగులఁగొట్టుకొని వాపోవు చిఱుతవానివలె నీవేల యిట్లలం బలవించెదవు. ఏల నామాట వినవైతివి.

రా. వినక నేఁజేసినదేమి ?

వి. ఓహో మఱచితివా ? మిన్నక చెంతఁజేఱుమని నేఁజెప్పినట్లు చేయక "ప్రకట ముఖాబ్జ సౌరభభరంబు" అని దుర్వాదగ్రస్తుఁడవై కటువచనంబుల నప్పుడు నీ యలీక పాండిత్యము నెరపనేల ? ఇప్పు డుపాయాంతరములకై దొరలనేల ?

రా. ఓరీమూర్ఖ, సాంత్వనవచనములం గటువచనంబు లందువేలరా ?

వి. ఎవఁడు మూర్ఖుఁడో తెలిసియేయున్నది. దీనికేమి దినమణి గ్రుంకనున్నవాఁడు గృహాభ్యంతరము ప్రవేశింతమురమ్ము.

రా. (విలోకించి) ఓహో ! దివసము పరిణత ప్రాయమైనదే:—

చ॥ దినరమవోయె నెచ్చెలిగతి న్నలినీద్యుతిఁగొంచు, భాస్కరున్
ఘనమగురాగమెల్లెడలఁ గప్పెను నాహృదయంబునుం బలెం,
దనకవఁబాసి జక్కవయు దానిఁదలంచుచునుండె నాసరో
జినికడనావలెం, గవిసెఁజీకటి నాయెడదం జగంబునన్॥

అందరును నిష్క్రమించుచున్నారు.

ద్వితీయాంకము ముగిసెను.



## తృతీయాంకము

మనోరమ ప్రవేశించుచున్నది.

మ. 'ఓమనోరమా, సాంకృత్యాయనిచే నాటకోపనిబద్ధమై బరగు నార్యపుత్రుని యొక్కయు నాయొక్కయు చరిత్రములో నిన్నఁబ్రదర్శింపగా మిగిలిన దీరేయిఁ గౌముదీ మహోత్సవమున మీవలనం బ్రదర్శింపఁ బడవలసియున్నది.' అని మాదేవి, వాసవదత్త యాజ్ఞాపించినది. నిన్న నాప్రియసఖి యారణ్యక పరధ్యానమునఁనుండి రసము చెడగొట్టినది. వాసవదత్తావేషమును స్వీకరించి యీరేయిఁగూడ

నట్లొనర్చునేని దేవికి కోపమువచ్చును. కావుననామె యెక్కడనున్నదో వెదకి చూచి చీవాట్లుపెట్టెదను. ఇదె, యారణ్యక తనలోఁ దానేమో యాలోచించుకొనుచు దీర్ఘికాతీరమునఁ గదళీ గృహము ప్రవేశించుచున్నది. ఈపొదచాటునఁ బొంచియీమె రహస్యాలాపనముల వినియెదను.

ఆరణ్యక ప్రవేశించుచున్నది.

ఆ. (కామావస్థ నటించుచు నిట్టూర్పు నిగుడించి) హృదయమా, అందని పండుల కఱ్ఱులెత్తి నన్నేల యాయాసపెట్టెదవు?

మ. ఓహో, ఇదియా యీమె పరధ్యానమునకుం గారణము? ఈపె కోరిక యేమో సావధాన చిత్తనై వినియెదను.

ఆ. (కన్నులనీరు దొరుఁగ) అంతసౌమ్యదర్శనుండగు మహారాజు నాకింత సంతాపము గూర్చుటెంతయు వింతగానున్నది. (నిశ్వసించి) ఆమహారాజునందు దోషమారోపింపనేల? మందభాగ్యులకు సుఖహేతువులే దుఃఖహేతువులుగాఁ బరిణమించును గదా?

మ. (సబాష్పముగా) ఏమీ మహారాజు నభిలషించుచున్నదా? మేలుచెలీ నీయభిలాష నీయాభిజాత్యమున కనురూపముగానే యున్నవి.

ఆ. నేనిప్పుడీ వృత్తాంతము నెవరికి నివేదించి దుర్భరమైన నాదుఃఖమునకుం గొంతయుపశాంతి నందఁగల్గుదును? (విచారించి) నాకు రెండవ హృదయమనందగు చెలికత్తె మనోరమ కద్దుగాని సిగ్గుగలిచి యామెకైనను దీనిం దెలుప మనసు గొలుపంజాలను. కావున నాకీపట్టున మరణమే శరణముగాఁ గన్పట్టుచున్నది.

మ. అయ్యో, చెలియనురాగ మతిమాత్రమై సుతిమించినట్లున్నది. నేనేమి సేయుదాన?

ఆ. (కోరిక లీరికలెత్త) మహారాజు, మధుకరములచే నాయాసమునొందు నన్ను గౌగిట నాదరించి వెఱపుదీర్చి యూరార్చిన కావివ్యాదియె.

మ. (హర్షముతో) ఏమీ, యీమె మహారాజు కంటంబడియెనా? అట్లైన నీయామెకు జీవితాశయుండవచ్చు. ఇందుకు శంకలేశమును లేదు. కావున నీ

మెచెంతఁజేరి యూరార్చెదను. (హఠాత్తుగాఁజేరి) చెలీ హృదయ సదృశనగు నా పట్టునగూడ నిట్టు లజ్జకెడమిచ్చు టుచితమేనీకు ?

ఆ. (లజ్జనటించుచు స్వగతముగా) హా! ఈమె సర్వమును వినియుండ నోపు నీమెకుం దెలుపుటయే యిప్పటికిం బోలినపని (కేలువట్టి ప్రకాశముగా) సిగ్గు నాచనవు చెల్లనీయదాయె దీని కలుగవలయునా చెలియా ?

మ. (హర్షముతో) నాకేటి యలుకగాని మహారాజు నిన్నుం గన్నులారఁ జూచెనా ? శంకదక్కి చెప్పుము.

ఆ. (సిగ్గుతో దలవంచి) అంతయు విని యడుగనేల ?

మ. మహారాజు కంటఁబడితివి. ఇంక సంతాప ముడుగుము. ఆతడే నిను వెదకికొనుచుండువాఁడు. ఇదియవశ్యం బిందునకు సంశయంబు వలదు.

ఆ. సఖీజనపక్షపాతమున నీవిట్లాలోచించెదవు. దేవీగుణ నిగళబద్ధుండగు నాయనవిషయమున నిదియెట్లు పొసఁగు.

మ. (నవ్వి) ఓసీ, చేల, యేల యిటులాలోచించెదవు ? నలినీసంగతింజెలంగుభృంగంబు నవమాలతింజూచినం దన్మరందాస్వాదంబు సొప్పడినగాక తృప్తి నొందియుండు టెట్లు ?

ఆ. ఇట్టి యసంభవ మనోగ్రథంబుల నేమి ప్రయోజనము ? శరదాతపంబుచే నాయంగికంబులెంతయు సంతప్తంబు లగుచున్నయవి. విశ్రమింతమురమ్ము.

మ. ఓ లజ్జావతీ ఇట్టియవస్థను జెందియు నీహృదయంబు మఱుంగు వెట్టెదవేల ?

ఆ. (మొగము వాంచుచున్నది)

మ. అవిసర్రింభంబున నీవు దెలుపకున్నను,

క॥ చెలి! నిశ్వాసమిషంబున
వెలువడు నీవలపులోలి విడువకవడు పూ
విలుతుని ములుకులగమి పే
రలివుగతి శ్రేయిఁ బవలునుడుగక బరగుఁ॥

(స్వగతముగా) ఇది యుపాలంభమునకుం గాలంబుగాదు. నలినీపత్రంబులఁదెచ్చి ఈ మెయిదపై గప్పెదను. (లేచి వెడలి దీర్ఘికనుండి నలినీ పత్రములం దెచ్చి యార ణ్యిక యెదపై గప్పుచున్నది) (ప్రకాశముగా) సఖీ ఊరటఁ గాంచుము.

(విదూషకుడు ప్రవేశించుచున్నాడు.)

వి. నాప్రియవయస్యున కారణ్యిక యందనురాగము మెండైనది గదా. రాజకార్యములఁ జాలించి యాతం డామె దర్శనోపాయ చింతనంబుననే తనమనం బునకు వినోదంబు గల్పించుకొనుచుండు. ఇప్పు డామెకై యెక్కడ వెదకుదును. ఓహో యీదీర్ఘికా ప్రాంతమున నన్వేషించెదను. (పరిక్రమించుచున్నాడు)

మ. (చెవియొగ్గివిని) శబ్దమువలెఁ దోచుచున్నది. కావున నీయనంటి బో దెలపొంతం బొంచి ఎవ్వరిటవచ్చుచున్నారో చూతము.

(ఉభయులు నట్లు చేయుచున్నారు

ఆ. అల్లదె మహారాజ పార్శ్వచరుడగు బ్రాహ్మణుఁడు.

మ. (విలోకించి) ఏమీ, వసంతకుఁడే. (హర్షముతోఁ దనలో) అతఁడే కావచ్చును.

వి. (దిక్కులు పరికించి) యేమి యిప్పుడారణ్యిక నిజముగా నారణ్యికయే యైయుండఁబోలు.

మ. (చిఱునవ్వుతో) రాజవయస్యుడగు బ్రాహ్మణుఁడే యీతడు నిన్ను గుఱించి యాలోచించుచున్నాఁడు కావున సావధానలమై విందము.

ఆ. (లజ్జాభిలాషలతో వినుచున్నది.)

వి. (ఉద్వేగముతో) గురుమదన సంతాపమున నిలోప్పకున్న నాప్రియవ యస్యుని ప్రార్థనంబున నేనంతఃపురంబెల్ల గాలించియు నాపెంగాననైతి. అటుపై నిటఁగూడ వెదుకవచ్చి, యిచ్చోఁగూడ గాంచనైతి. ఇక నే జేయవల్లసినదేమి.

మ. వింటివా, సఖీ?

వి. (ఆలోచించి) ఆహా! ఇంకొక్క సంగతి మఱచితిని. "ఆపెనుగాంచె జాలనేని యల్లచట దీర్ఘికయందామె కరతల స్పర్శ శీతలంబులగు నలినీపత్రంబులం

గొనిరమ్ము' అని నావయస్యుడు చెప్పినాడు. కాని యట్టివానిం దెలియుటెట్లు!

మ. ఇదియె నాకుచితావసరము (విదూషకుం జేరి కేలుగ్రహించి) వసంతక, నాతోరమ్ము నేదెలిపెద.

వి. (భయముతో) ఎవరికిఁదెలుపుదువు, దేవికా? నేనేమియు దుర్మంత్రము చేయలేదే?

మ. వసంతక, యిట్టిశంకలు దక్కుము. మీచెలికాఁడు ఆరణ్యికకొరకై యేయవస్థలో నున్నాఁడో యింతకినుమడియగు నవస్థయందు రాజుకొరకై మాచెలిక త్తెయున్నయది. ఇదిగో చూడుము (ఆరణ్యికను జూపుచున్నది).

వి. (చూచి స్వగతముగా) నాపరిశ్రమ ఫలించినది. శ్రీమతి, నీకు మంగళము

ఆ. (లజ్జతో కమలపత్రములం దొలఁగద్రోచి నిలుచుచున్నది.)

మ. ఓయి, వసంతక, నీదర్శనమాత్రముననే మాచెలి సంతాపముడిగినది. తానే నలినీపత్రముల నొసంగుచున్నయది. గాన వీనింగైకొనుము.

ఆ. ఓసీ, పరిహాసశీలా, నన్నేల యీలీల లజ్జపాలు సేసెదవు? (మొగము నుఁబల్చి నిలుచుచున్నది)

వి. (విషాదముతో) ఈ నలినీపత్రముల నిటుండనిమ్ము. మీచెలియింత లజ్జాలు వైనం బొత్తు పొసగు టెట్లు?

మ. (క్షణమాలోచించి హర్షముతో) వసంతక ఇట్లు (అని చెవిలోఁచెప్పుచున్నది)

వి. మేలు చెలీ మేలు (అపవారణముచేసి) మీరు వేషములు గైకొనునంతకే నేనును నాప్రియవయస్యుని దోడ్కొని యిదే వచ్చుచున్నాఁడను. (నిష్క్రమించుచున్నాఁడు)

మ. ఓకోపనా, లెమ్ము నిన్నటిరాత్రి నాటకశేష మీరేయిప్రదర్శింపఁ బడవలసియున్నది. గానం బ్రేక్షాగృహమునకే పోదము (పరిక్రమించి చూచి) ఇదే ప్రేక్షాగృహము; ప్రవేశింతము (ప్రవేశము నటించిచూచి) సర్వము సిద్ధమయినది. దేవి రానున్నది.

(దేవి సాంకృత్యాయనులును విభవోచిత రూపముగఁ

బరివారమును బ్రవేశించుచున్నారు.)

వాసవదత్త. ఓ భగవతీ, ఏమి నీకవిత్వ నైపుణ్యము ; అనుభవపూర్వకముగా నే నెఱింగిన యార్యపుత్రచరిత్రము నీచే నాటకోప నిబద్ధమై యదృష్ట శ్రుతపూర్వమగు కథ వలెనే క్రొంజవులునించి కౌతూహలము వెంచుచున్నయది.

సాంకృ. ఆయుష్మతి. అసారమయ్యు నా కావ్యమిటులఁ దోచుటెల్ల నాశ్రయ గుణంబే సుమీ.

క॥ మహదాశ్రయ లాభంబున
రహిమించి గొఱంతవీడి రమ్యత వెంచున్
మహినల్పంబును శోభా
వహవారణ కుంభభాసి భసితము వోలెన్॥

వా. (స్మితముతో) అల్లుడుఁగారి యందెల్లరకును బక్షపాతముండు టుచితమే కదా. ఇంక నీ యుపోద్ఘాతము చాలించి నాటకము చూతమురమ్ము.

సా. ఆలాగే. ఇందీవరికా ప్రేక్షాగృహమునకుం ద్రోవదీయుము.

చేటి. దేవీ, ఇటురమ్ము.

(అందఱుం బరిక్రమించుచున్నారు)

సాం. ఆహా! ప్రేక్షాగృహముయొక్క ప్రేక్షణీయత.

మ॥ తతరత్నాంచితశాత కుంభఘటితస్తంభాగ్రదేశావలం
బిత ముక్తాఫల దామరమ్య మగుచుం బ్రేక్షాగృహంబప్సరః
ప్రతిబింబంబులఁ బోలుపంకజముఖీ వ్రాతంబుతో నిండి య
ద్భుత శోభాయుతమై విమానముగతిం బొల్పారుఁగన్పండువై॥

మనోరమారణ్యికలు. (సముఖమునకుఁజేరి) జయము దేవీ జయము.

వా. అతిక్రమించినదిగదా సంధ్య కావున మీరుపోయి శీఘ్రముగ వేషములు ధరించిరండు.

ఉభయులును. దేవీచిత్తానుసారమొనర్చెదము (బయలుదేరుచున్నారు)

వా. ఆరణ్యికా, నీవు నా మేనిసొమ్ములే గైకొని యలంకరించికొనిరమ్ము (నగలుదిగిచి యీయ సిద్ధమైయుట పైచుచున్నది.) మనోరమా నీవును ఇందీవరికనుండి

నలగిరి గ్రహణముచే సంతుష్టుఁడైన మాతండ్రిచే నార్యపుత్రునకు బహుమానంబుగా నొసంగఁబడిన యాభరణములఁగైకొని, కైసేసికొనిరమ్ము. అట్లైన నీవేష మెంతయు నొప్పెడిని.

మనో. (ఇందీవరికనుండి యాభరణములుగైకొని యారణ్యకతో గూడ నిష్క్రమించుచున్నది).

ఇందీవరిక. (ఆసనము నిర్దేశించి) ఇదేయాసనము. దేవీ కూర్చుండుము.

వా. (ఆసనము నిర్దేశించి) భగవతీ, ఇందాసీన నగుము.

సాంకృత్యాయనియు దేవియు గూర్చుండుదురు.

(తర్వాత వేషముధరించి కంచుకి ప్రవేశించుచున్నాఁడు).

కంచు. క॥ అంతః పురములలోపల
నెంతేని వ్యవస్థసేయు చెడ సెడఁదడబా
టంత యు దండము మెయిసవ
రింతు జరాభరము నాకు నృపవైభవమా॥

విజితాఖిలారాతి సైన్యుండై యదార్థనామము వహించిన మహాసేనుడు "ఎల్లి మేము దయనోత్సవ దర్శనానంద మనుభవించెదము గాన నందులకై యుందఱును సముదితోజ్జ్వలవేషలయి మన్మధోద్యానమున కరుగుదెంచని యంతిపురంబులోనం దెలియపఱుపుము" అని యాజ్ఞాపించినాఁడు.

సాం. (కంచుకిం జూపుచు) నాటకము ప్రారంభమయినది. చూడుము.

కం. మన్మధోద్యానమునకు రండనిమాత్రము దెలుపపలసియున్నది. 'ఉజ్జ్వలవేషలయి' యని తెలుపంబని లేదు. ఏలన అంతిపురములోన——

చ॥ పదముల నూపురంబులును బాహుయుగంబున నంగదంబులుం
గుదురగుఁ జన్నుదోయిపయి గోమలహారములుం గటిస్థలిన్
మృదురశన ల్గరంబుల మణీవలయంబులుఁ గర్ణసాళినిం
పొదవెడు రత్నకుండలము లొప్ప నెలంతలు రమ్యవేష లై॥

యుందఱు నిరతోజ్జ్వల వేషలయ్యే వర్తింతురు. వీరలకుం గ్రొత్తగాఁ జేయవలయు సింగారంబులేదు. రాజపుత్రికొఱకు మఱియునొక యాదేశము గలదది యామెంగ

నీ తెలియ పఱచెద (అనిపరిక్రమించి చూచి) ఇదె వాసవదత్త వీణాహస్తయగు కాంచనమాలచే ననుగమ్యమానయై గాంధర్వశాలఁ బ్రవేశించుచున్నది. ఆమెనుగలిసి రాజాదేశమును దెల్పెదను. (అంత వాసవదత్తవేషమును గ్రహించి యాసనస్థయై యారణ్యకయు, వీణాహస్తయై కాచనమాలయుఁ బ్రవేశించుచున్నారు),

ఆర. కాంచనమాలా, వీణాచార్యుఁడేల యాలస్యము సేసినాఁడు.

కాం. రాజపుత్రీ; ఆయనకొక యున్మత్తుఁడు గనంబడినాఁడు. వానిమాటలు పల్మారుభావించుచు సానందము నొందుచున్నాడు.

ఆ. (హస్తతాళము సేయుచునవ్వి) "సదృశులు సదృశులచే రంజింపఁబడుదురు" అనుమాట నిక్కము సుమ్మీ, చెలీ.

సాం. (వాసవదత్తతో) రాజపుత్రీ, ఈమెతన యాకృతి విశేషముచే నీవేషంబునకుం గొండొక వన్నె వెట్టినది.

కం. (చేఱనతెగి) (వాసవదత్తా వేషమును ధరించిన యారణ్యకతో) రాజపుత్రీ; "రేపునీవు వీణవాయింప వినవలతుంగావున, ఘోషవతి నవతంత్రి సజ్జితము సేసి దానింగైకొని మన్మథోద్యానమునకు రమ్ము" అని మహారాజానతిచ్చినాఁడు.

ఆ. అట్లయినచో వీణాచార్యుని వేఁబంపుము.

కం. ఇదె వత్సరాజునంపెద (కంచుకి నిష్క్రమించుచున్నాడు).

ఆ. కాంచనమాలా ఘోషవతి నిటఁలందిమ్ము. తంత్రులు సారించెదను.

కాం. (వీణ నందిచ్చుచున్నది).

ఆ. (ఉత్సంగమున వీణనుంచి తంత్రులు సారించుచున్నది)

(అంతట వత్సరాజవేషము ధరించి మనోరమ ప్రవేశించుచున్నది.)

మనో. (స్వగతముగా) మహారాజు తడవుసేయుచున్నాఁడు. వసంతకుడు చెప్పెనో లేదో. లేక రాజు దేవికై జడియుచున్నాఁడో. ఇప్పుడు వచ్చెనేని యెంతయు రమణీయముగా నుండును.

(అంత రాజును విదూషకుడుఁను బ్రవేశించుచున్నారు.)

రా. చ॥ తలకొని పూర్వరీతి తను తాపమొనర్పవు వేడి వెన్నెలల్
వెలువడు నూర్పులోలిఁ గమలింపవు వాతెరసోకినంత నే
యలసత దగ్గెనంగములయందు మతంబును వీడెశూన్యతన్
కులుకఁగ నంతలీప్సిత మనోరథ చింతనమాత్రి నెంతయుఁ॥

"నాప్రియసఖి మహారాజుయొక్క దర్శనపథమున నైనఁ బడకుండ దేవిచేఁ గాపాడ బడుచున్నయది. కావున సమాగమోపాయమొక్కటియే దోచుచున్నది. ఈరేయి దేవియెదుట నుదయన చరిత్రమను నాటకము ప్రదర్శింపఁ బడవలసియున్నది. అందారణ్యక వాసవదత్త వేషమును నేను వత్సరాజు వేషమును గైకొన నియమింపఁ బడితిమి. ఆనాటక ముఖంబుననే కథయంతయు సాగింపవలసి యున్నది. కావున నీవేషము స్వయముగా నలంకరించి సమాగమ సుఖమనుభవింపుము" అని మనోరమ చెప్పిన పల్కులు నిక్కమేగద.

వి. నామాటయందు నమ్మకము లేనిచో, నిదె మనోరమ నీవేషము స్వీకరించి యీడనున్నది ఆమెనడిగి తెలిసికొనుము.

రా. (మనోరమ చేరువకరిగి) మనోరమా, వసంతకుఁడు చెప్పునది సత్యమేనా ?

మనో. సత్యము స్వామీ. ఈయాభరణములతో నీవలంకారము సేసికొనుము (తొడవులూడ్చి సమర్పించుచున్నది.)

రా. (ధరించుచున్నాఁడు).

వి. వీరుగదా రాజులు, దాసీలవలె నృత్యము సల్పెదరు. ఆహా! కార్యగౌరవ మెవరి నేమేమి సేయింపదు.

రా. (నవ్వి) మూర్ఖ, యిది మేలంబునకుం గాలంబుగాదు. చిత్రశాల రహస్యముగాఁజేరి నీవును మనోరమయు మాన్వృత్తముఁ జూచుచుండుడు.

(ఉభయులు నట్లుచేయుచున్నారు)

వి. (అట్లుచేయుచున్నాఁడు)

ఆ. కాంచనమాలా, వీణ కొంచెము నిల్పి నిన్నొక్కమాట నడిగెదను.

రా. కథ యేపట్టునకు వచ్చినదో వినియెద.

(సావధానముతో వినుచున్నాఁడు.)

కాం. అడుగుము రాజపుత్రి.

ఆ. "వీణవాయించుచు దన్ను మెప్పించు నేని వత్సరాజును జెరనుండి విడి చెదను" అని మాతండ్రి యన్నది సత్యమేనా ?

రా. (పటాక్షేపము చేఁబ్రవేశించి, హర్షముతోఁ జేలము జెంగుముడి వైచుచు) శంక యేటికి,

క॥ పరిజనములుఁ బ్రద్యోతుఁడు
బరవశతం జొక్క వీణ వాయించుచును సుం
దరిగొని యరిగెద నిదెమ
త్కర శరలాఘవము జగముగని నుతియింపన్॥

యౌగంధరాయణుఁడు నానిర్గమనమునకు సర్వమును సంఘటించి యున్నాఁడు.

వాస. (సంభ్రమముతో నిలిచి) జయ మార్యపుత్రునకు.

రా. (స్వగతముగా) నన్ను గుర్తించినదియా యేమి దేవి.

సాం. (దేవి నుద్దేశించి) ఏల యీసంభ్రమము ? ఇది నాటకమేగదా ?

రా. (హర్షముతో నాత్మగతముగా) హా. దీననాప్రాణములు కుదుటబడ్డవి

వా. (విలక్షస్మితముతో) ఓహో ఇది మనోరమయే కాదా ? ఆర్యపుత్రుఁ డని భ్రమసితిని. బాపురే మనోరమా. ఎంతబాగుగ నటించితివి.

సాం. రాజపుత్రి, మనోరమవలన నీకుఁ గల్పింపఁబడిన భ్రాంతి యెంతయు యుక్తముగానే యున్నది.

శా॥ రూపంబల్లదె మోహనంబు, నడతీరున్యాధనాథోచితం
బాపాటంగనుపట్టు, వేషమదె యత్యంతోజ్జ్వలంబూ, స్మితం
బైపాల్పారెడు సత్వమల్లదె, ఘనహ్రీదానః కారస్వనం
బాపోల్కి న్వినవచ్చు, నచ్చుపడువత్సాధీశు లీలల్గదున్॥

వా. ఓసీ యిందీనరికి, ఆర్యపుత్రుఁడు నిగళబద్ధుండయ్యె నాకు వీణ నేర్పినది. కావున నీవీ నల్లగలువలదండను దత్పదముల సంకెలగా గదియింపుము. (అని యౌదలనుండి కలువలదండం దిగిచి యిచ్చుచున్నది).

ఇందీవరిక. (అట్లొనర్చి మరలివచ్చి కూర్చున్నది).

ఆ. కాంచనమాలా, "వీణ వాయించుమందన మనము హరించునేని వత్స రాజునకుం జెఱనుండి విడుగరయొసంగెదను". అని మాతండ్రియన్నది సత్యమేనా?

కాం. సత్యమే; సర్వథా వత్సరాజు మెప్పువడయు నట్టుల వర్తింపుము.

రా. నేఁజెప్పవలసినమాట కాంచనమాలయే చెప్పినది.

ఆ. అట్లేని ఆదరముతో వీణవాయించెదను (పాడుచు వాయించుచున్నది)

క॥ ఘనబంధన రుద్ధంబుగ
గనముంగని రాజహంస కాంతంగొని వే
తనవసతి మానసంబల
రను విహరణసేయఁ జూచుఁ బ్రమదంబారన్॥

విదూ. (నిద్రి నటించుచున్నాడు).

మనో. (చేతులతోఁ గదలించుచు) వసంతక, చూడు, చూడు. నాప్రియ సఖి పాడుచున్నది.

వి. (రోషముతో) ఓసీ దాసీసుతా, నీవును నన్నుం గునుకనీయవు. ఆర ణ్యక నాయయస్యని కనులం బడినప్పటినుండియు రేయుంబవళ్లు నాకుం గంటిమీఁద ఱెప్పవాలుటలేదు. కావున నొక్కయెడంజేరి యించుక నిదురించెదను. (అని యవ్వలి కఱిగి పండుకొను చున్నాఁడు).

ఆ. (మఱలఁ బాడుచున్నది)

క॥ కాముఁడు వాముండగుట
న్గామిత దయితావలోకనం బొదవమి నా
కామిని మధుకరి తాళఁగ
లేమిం గడుగుంది సంచలించెడు భీతిన్॥

రా. (విని యాదరమునంజేరి) భళీ రాజపుత్రి భళీ. ఏమి యీగీత వాదిత్రములు:—

శా॥ మేలంబయ్యెడు జంత్రగాత్రములలో మించెంద్రివృత్తుల్గరం, బాలోనంద్రుతమధ్యలంబితలయన్యాసత్రయంబందెడు, న్మేలైయొప్పె యతిత్రయంబు, రహిమించె న్వాద్యసంపత్తి, యీ ద్వేలంబైన సుఖాబ్ధిఁదేలెడు భవద్గీతాప్తిచే సర్వమున్॥

ఆ. (వీణవీడి యాసనమునుండిలేచి నిల్చి రాజును సాభిలాషముగాఁ జూచుచున్నది) ఉపాధ్యాయ, ప్రణామము సేయుచున్నదాన.

రా. (నవ్వుచు) నాకోర్కె కొనసాగుగాత. ఇదే నీకాశీర్వచనము.

కాం. (ఆరణ్యక యాసనమును నిర్దేశింపుచు) ఉపాధ్యాయా, ఇందుఁ గూర్చుండుడు.

రా. (కూర్చుని) రాజపుత్రి యెందుఁగూర్చుండెడును ?

కాం. (నవ్వి) ఇప్పుడేకద రాజపుత్రి తన విద్యానైపుణ్యముచే మీమెప్పు వడసినది. కావున నింకనీపె యుపాధ్యాయ పీఠికనుండ నర్హురాలు.

రా. అర్ధాసనంబునుండ నర్హురాలవే, నీవిందుండుము.

ఆ. (కాంచనమాలవంకఁ జూచుచున్నది).

కాం. (సస్మితముగా) రాజపుత్రి, కూర్చుండుము. దోషమేమి శిష్యావిశేషంబవేకదా నీవు.

ఆ. (సలజ్జముగాఁ గూర్చుండుచున్నది).

వా. (లజ్జతో) భగవతీ, నీకావ్యపుంచధికకల్పనఁజేసితివి. ఆనాడు నేనార్య పుత్రినితోనే కాసనంబున నుండలేదే.

రా. మఱలవిన నిచ్ఛవొడమెడు. వీణ వాయింపుము.

ఆ. (స్మితముతో) కాంచనమాలా చాలసేపు వాయించి యలసియుంటిని. నాయంగకంబులు బడలినవి.

కాం. ఈపె చిరపరిశ్రాంతిచే నెంతయుశ్రాంతయైనది. చూడుము. కపోలతలంబున ముత్తెములవలె స్వేదబిందువులు దూగుచున్నయవి. కరపల్లవంబులు గంపించుచున్నవి. కావున నీపె కొంతవిశ్రాంతి వడసి సేదదేఱుగాక.

రా. కాంచనమాలా, నీవచనంబులెంతయు నుచితంబులు. (కేలువట్టఁ బోవుచున్నాడు).

ఆ. (కేలుమలంచుచున్నది).

వా. (సాసూయముగా) నీవధికవర్ణన సేసితివి. నేని కాంచనమాలా కావ్యముచే వంచింపఁ బడుదానను గాను.

సాం. (నవ్వి) ఆయుష్మతి, కావ్యమిటులనే యుండును.

ఆర. కాంచనమాలా, నీవు తొలఁగిపొమ్ము. నాకు నీయందిష్టము తప్పినది.

కాం. (సస్మితముగా) నేనిక్కడుంట యిష్టములేనిచోఁ బోయివచ్చెద (నని తొలగిఁపోవుచున్నది).

ఆ. (సంభ్రమముతో) కాంచనమాలా, నిలు నిలు. ఇదె, వీరికిం గేలొసంగుచున్నదాన.

రా. (ఆరణ్యక కేల్వట్టి)

చ॥ జలజల, మంచుబిందువులు జాఱగఁ,జల్వలఁజిమ్ముఁదమ్మిగా
వలె; నుదయాతపంబుపయిఁ బర్వినఁగాకెటులబ్బుఁ దమ్మికీ
చెలువు ? నఖేందుపంచకము జిక్కెడునో‌హిమ? మాహిమాంశుఁడు
న్వ్రాలిఁగెడు చిచ్చువ్రాలె; సుధస్వేద మిషంబు ననూరెగావలెన్॥

(ఆరణ్యక కేలు దనయెదకు హత్తించుచు)

క॥ నవవిద్రుమపల్లవముల
నవలీల జయించు నీదుహస్తంబున నా
యవదాతంబగు హృదయము
నవరాగము గాంచిమించు నళినదళాక్షీ॥

ఆర. (స్పర్శవిశేషమును నటించుచు) మనోరమ నంటినమాత్రాన నాయంగకములేల వికృతిపాలగుచున్నవి ?

వాస. (దిగ్గనలేచి) భగవతి, నీవు చూచుచుండుము. నేనీయబద్ధముల జూడనొల్లను.

సాం. రాజపుత్రి, ధర్మశాస్త్ర విహితంబగు గాంధర్వవివాహం బబద్ధంబగు టెట్లు? నీవిట్లు లజ్జావిలీవగుదువేల? ఇది ప్రేక్షణీయకమనుమాట మఱచితివి గాఁబోలు కనపట్టున రసభంగ మొనర్చి పోవుటుచితమే నీకు?

వాస. (వెడలి పోవుచున్నది).

ఇందీ. (విలోకించి) దేవి, వసంతకుఁడు చిత్రశాలాద్వారమున నిద గాఢని ద్ర నున్నవాడు.

వాస. (నిరూపించి) ఓహో వీఁడు వసంతకుఁడే. (ఆలోచించి) రాజుకూ డనిటనుండనగు. వీనిలేపి గనుగొనియెదను (అని లేపుచున్నది),

విదూ. (నిద్రమత్తుతోలేచి యులికిపడిచూచి) ప్రియవయస్యుఁడాట ము గించివచ్చినాఁడా? ఇంకనాడుచున్నాడా ?

వాస. (విషాదముతో) ఏమీ, ఆర్యపుత్రుఁడాడుచున్నాఁడా? మనోరమ యేడనున్నది ?

విదూ. అదె, చిత్రశాలలో.

మనో. (భయముతో) ఓహో, దేవి గొప్పయూహతోనే యీయాలోచ న చేసినట్లున్నది. ఈమూర్ఖ బ్రాహ్మణుఁడు గూడ బుద్ధిజాడ్యముచే వ్యవహారము చె డఁగొట్టినాడు.

వాస. (రోషమెలర్చునవ్వుతో) మేలు, మనోరమ, మేలు. నీయాట బా గుగ నాడితివి.

మనో. (భయకంపములతో పాదములఁబడి) దేవి, యీదుస్సాహసము నాది కాదు. ఈతులువ నాయొడలి తొడవులూడ్చి పుచ్చుకొని నన్నిక్కడ ద్వారమున ని లిపియుంచినాడు, నామొర మురజ నిర్ఘోషాంతరితమగుటచే నెవ్వరికి వినరాదయ్యె.

వాస. ఓసీ, లెమ్ము. సర్వముం దెలిసితి. ఈవసంతకుడే యీనాట్యకౌ వృ త్తాంత నాటకసూత్రధారుడని తెలిసియేయున్నది

విదూ. స్వీయబుద్ధి నూహింపుము. వసంతకుఁడేఁడ నాటక్యకయేఁడ !

వాస. మనోరమా, వీనింగట్టిగా బంధించి వెంటగొనిరమ్ము; నేనా నాటక ముఁ జూడఁబోయెద.

మనో. (స్వగతముగా) ఇప్పుడు నా కూరట గల్గినది. (ప్రకాశముగా) అంతేకావలె (ననుచు విదూషకుని బంధించుచు) ఓరి జడబుద్ధీ, ఇకనీదుర్నయ ఫల మనుభవింపుము.

వాస. (సంభ్రమముతోఁజేరి) ఆర్యపుత్ర, నా యపరాధమును క్షమింపుము (అనుచు పదములఁ గలువదండఁ దొలగించుచున్నది).

ఆర. (భయముతో నెడగలుగంజని నిలుచుచున్నది).

రా. (దిగ్గునలేచి మనోరమా విదూషకులంజూచి యాత్మగతముగా) ఆహా పట్టుబడితినిగదా: (విస్మయ సంభ్రమములు నటించుచున్నాడు).

వాస. (మందహాసముదోప) సైరింపుమార్యపుత్ర, మనోరమయను నపాహచే గలువలదండచే బంధించితిని క్షమింపుము.

సాం. (అందఱినిజూచినవ్వుచు) ఇది మరియొక నాటకమైనది. నాబోట్లకిది తొపుగాదు. (అని నిష్క్రమించుచున్నది).

రా. (ఆత్మగతముగా) ఈకోపప్రకార మపూర్వముగా నున్నది. అనునయము దుర్లభముగాఁ దోచుచున్నయది. (ఆలోచించి) ఇట్లు సేసెదను. దేవి, కోపము వీడుము.

వాస. ఎవరికి కోపము ?

రా. ఏమీ, నీకుకోపమేలేదా ?

చ॥ చెలిమియపాంగ పంక్తులనుఁ జిప్పిలుచుండియుఁ గావిదోఁచెడుం,
బలుకులఁ దియ్యమొప్పియును బాయదుగద్గదికంబు నుత్తుకన్,
వెలుపడలేక చిక్కియును వేస్తవ వేపథుగూర్చునూర్పు, ల
క్ష్మిలిఁ జిరునవ్వుగప్పినను మీదికినుబ్బెడుఁ గోపమెంతయున్ ॥

చెలీ యలుకడక్కి ప్రసన్నవగుము.

వాస. అరణ్యకా, నీకుకోపమువచ్చినదని యార్యపుత్రుడను నయించుచున్నవాఁడు. దరిజేరుము.

ఆర. (భయముతో) నాకేమియుఁదెలియదు.

వాస. నీకెట్లుదెలియును ? తెలిపెదఁగాక. ఇందీవరికా, దీనిఁగూడ నీతో వసించుము.

విదూ. దేవి, ఈకౌముదీ మహోత్సవమున నీచిత్తహరణార్థము నావయ

స్త్యుడీ నాటకమాడెను.

వాస. నాటకమా? మీబూటకములు విన్న నాకు హాసము జనించెడు.

రా. మరియొకలాగున నాలోచింపకుము. సైరింపుము,

చ॥ భామముడిచే లలాటశశివొందఁగనేల కలంక, మల్కమై
యమలజపాపసూన సదృశాధరమిట్లు చలింపనేల, మ
ధ్యముస్తనయుగ్మభారమున నల్లలనాడఁగనేల, యల్కవీ
డుము భవదీయ చిత్తము గడుఁబ్రమియింపఁగ నింతసేసితిన్॥

వాస. నేటికిదిచాలు. నాటకము చాలించి యభ్యంతరము ప్రవేశింతము

(అని నిష్క్రమించుచున్నది.)

రా. ప్రసాదము నందకయే దేవి లేచిపోయినది. అకటా! ఎట్టి సంకట మునఁబడితిని.

మ॥ వికట భ్రూకుటిఫాలభాగఘటిత స్వేదాంబుపూరోజ్జ్వలం
బొకచోఁ రోషమువొంగఁ గోపనముఖంబు గ్రొంబుగాదోచు, నొం
డొకచో భీరుముఖాబ్జమొప్పెడు భయోద్యుక్తిం జలాపాంగము
ల్చకితైణీ నయనోపమంబులయి చంచల్లీలగంపింపగన్॥

దేవి శయనాగారమునకుం బోయి ప్రసాదనోపాయం బరసెదను. (అందరు నిష్క్రమించుచున్నారు).

తృతీయాంకము ముగిసినది,



## చతుర్థాంకము

అంతట మనోరమ ప్రవేశించుచున్నది.

మనో. (శోకముతో) ఆహా! దేవికెంత దీర్ఘరోషము. ఆరణ్యిక యెన్నాళ్ళు చెఱలోనుండినను, ఆమెపై యనుగ్రహాము పూనదు. ఆరణ్యికయు బంధనదుఃఖముకంటె రాజదర్శననిస్పృహత్వముచే నెక్కువ పీడింపబడుచున్నది. ఆ పీడ సహింపఁజాలక యొకతూరి యాత్మహత్యకుఁ గూడసమకట్టినది. నేఁడెలిసివారించి యీసంగతి రాజునకు విన్నవింపుమని విదూషకునితో నిప్పుడే చెప్పివచ్చితిని.

(అంతట కాంచనమాల ప్రవేశించుచున్నది)

కాం. నేనెంత వెదకినను సాంకృత్యాయనిం గానకున్నాను (విలోకించి) ఈమనోరమనుగూడ నడిగెదను. (చేరి) మనోరమా, భగవతి సాంకృత్యాయని యెచ్చటనున్నదో నీవెఱుంగుదువే ?

మనో. (విలోకించి కన్నీరు దుడిచికొని) ఓసీ కాంచనమాలా, నేనామెను జూచితిని. ఆమెతో నీకుం బ్రయోజనమేమి ?

కాం. మనోరమా, ఈపొద్దు దేవి కంగారవతినుండి జాబువచ్చినది, అ ది చదివినంతనే మనిదేవికెంతయు వంత వొడమినది. తద్విమోచనార్థము సాంకృత్యాయనికై దిరుగుచున్నదాన.

మనో. ఆజాబులోని సమాచారమేమి ?

కాం. "నాతోబుట్టువు నీకుందల్లియే. ఆమెభర్తయును గృహమ్ము నీకుందండ్రి అతడు కళింగహతకునిచేఁ జెఱనుంచబడి సంవత్సరము దాటినది. సమర్థురాలవగు నీవిట్లు ముఖముననుండియు నాయనకీ వృత్తాంతమును దెలుపక యుదాసీనవై యుండుట యెంతయు ననుచితము" అని.

మనో. కాంచనమాలా, ఈవృత్తాంతమును దేవి కెవ్వరును దెలియనీయకుండఁ గూడదని ఉని యానగదా ? అట్లయ్యును దేవికెవ్వరు దెలిపిరి ?

కాం. నేఁజదువుకొని యూరకున్న నాహస్తమునుండి జాబుపుచ్చుకొని దేవి స్వీయముగా జదువుకొన్నది.

మనో. అయినేపొమ్ము అదె దేవియామెతో గూడి వంతవలభియందు మంతనంబున నున్నది.

కాం.. దేవిసకాశమున కేగెదను (అని నిష్క్రమించుచున్నది).

మనో. నేనార్యజ్యేష్ఠకను జూచి చాలకాలమయినది. ఆమె ప్రాణముల విషయమున నెంతయు నిర్వేదమునంది యున్నది. ఎవ్వరేమి చేయుచున్నారో చెప్పలేము. కావున నేనామెయొద్దకే పోయెదను. (అని నిష్క్రమించుచున్నది.)

ప్రవేశకము ముగిసినది.

(అంతట ఆసీనయై విషణ్ణయగు వాసవదత్తయు, సాంకృత్యాయనియు,

విభవమునకుఁ దగుపరివారమును బ్రవేశించుచున్నారు.)

సాం. రాజపుత్రి, వంతవీడుము. నీపినతల్లి పెనిమిటి చెఱలోనుంట దెలిసి యుపేక్ష సేయువాఁడుగాడు వత్సరాజు.

వాస. భగవతి, నీవు మాయమర్మము లెఱుంగవు గాన నిట్లుదలంచెదవు నాయందాదరములేని వానికి నావాండ్రియందుండునా? మాతల్లి నేనిప్పుడును అప్పటి వాసవదత్త నేయనుకొని యిట్లు వ్రాసియుండునుగాని ఆరణ్యికా వృత్తాంతము గన్నులారజూచి నీవును ఇట్లువల్కుటెట్లు.

సాం. ప్రత్యక్షముగాఁ జూచినకారణమున నే యిట్లుపల్కుచుంటిని. కాముదీమహోత్సవమున నిను నవ్వించుటకే యతండట్లు సేసెను.

వాస. నన్ను నవ్వించినమాటయే వాస్తవము. నీకండ్లయెదుట నపుడట్లు నవ్వులపాలయి, యిపుడిట్లు తిరిగినిల్చుటకు నాకు సుంతయు మొగము చెల్లకున్నయది ఇకనాకథలేల చాలింపుము. నిశ్చయముగ నేనిట్టి పక్షపాతముననే నిట్టి యవస్థకు వచ్చితిని. (అని యేడ్చుచున్నది).

సాం. రాజపుత్రి, వత్సరాజంత యసరసుఁడేలయగు? (విలోకించి) నామాటలేల; ఇదె వత్సరాజే యిటువచ్చుచున్నాఁడు. ఆతండ నీయలుకదీర్పనోపు.

వాస. భగవతీ, ఇవన్నియు నీమిథ్యా మనోరథములు.

(అంత, రాజును విదూషకుఁడును బ్రవేశించుచున్నారు.)

రా. ప్రియామోచనమున కేమి యుపాయము?

వి. చింతవీడుము. నేనుపాయముఁజెప్పెద.

రా. (హర్షముతో) త్వరగాఁజెప్పుము.

వి. ఓయీ, నీవు అనేక సమరసంఘట్ట ప్రహారాంకిత బాహు యుగళుండవు. అనేక గజతురగ పదాతి దుర్విషహ సేనాసముదయుండవు. ఇంత చింతింపనేల బలములంగూర్చికొని యంతఃపురంబుపై దాడివెడలుము. అట్లయిన నారణ్యికను నిముసంబులో విడిపింపవచ్చు.

రా. ఆహా! నీబుద్ధివైశద్యము. ఎంతసులభమైన యుపాయముఁ జెప్పితివి

వి. ఇందుదుర్లభమేమున్నది ? అంతఃపురములో కుబ్జవామన మగ్ధ గృహకం-
చుకులు దిక్క తక్కొరులుండరుగదా.

రా. (అవజ్ఞతో) ఛీ యిట్టి యసంబద్ధ ప్రలాపములు గట్టిపెట్టి దేవీప్రసా
దమువడసి సేయంగల యుపాయ మూహించి చెప్పుము.

వి. షణ్మాసోపవాసముసేసి బ్రతికిబాగుంటివా దేవి ప్రసన్నయగును.

రా. (పక్కునవ్వి) పరిహాసము చాలించి ఎట్లు ప్రసన్నయగునో చెప్పుము.

చ॥ ఎదురుగ నేగి నవ్వొలయనింతి గ్రహింతునొకొంతసీమఁ ద
త్పదముల వ్రాలి కేల్మొగిచి పాయక యడ్డముసొచ్చి నిల్తునో,
మృదుమధుర ప్రియోక్తులను బ్రీతియొనర్తునొ, నాకుఁజూడనె
య్యదియును దోచదాయె చెలియల్క మరల్ప నుపాయమీయెడన్॥

రమ్ము దేవీ సమ్ముఖమున కేగుదము.

వి. నీవుపొమ్ము. నేనెట్లెట్లో చెఱ వదిలించుకొని బయలువడితిని. నేరా
ను పోయివచ్చెద.

రా. (నవ్వుచు కంఠముపట్టి బలిమిని మఱల్చుచున్నాడు) మూర్ఖ, యి
టురమ్ము. (పరిక్రమించిచూచి) ఇదె దేవి, దంతవలభిలో నిషణ్ణయై యున్నయది.
దగ్గఱకఱిగెదను. (అని లజ్జతోఁ జేరుచున్నాడు.)

వాస. (విషణ్ణవదనయై లేచుచున్నది).

రా. ఆ॥ కలికియిట్టులేల కడుసంభ్రమంబున ।
నాసనంబు డిగుచు నలరుదీవు ।
నెయ్యమొలయనలరు నీవాలుచూపు చొ ।
ప్పడినమాత్ర ముదము గడలుకొనదె ॥

ఇట్టి యత్యాదరముచే నాకేల వైలక్ష్యము గూర్చెదవు?

వాస. (ముఖము నిరూపించి) నీకా వైలక్ష్యము ?

రా. ప్రియసఖీ, ఔను నీకండ్లయెదుట నపరాధమొనర్చి నిన్ననునయింపం
బూను నాకు వైలక్ష్యము గాకేమి ?

స్వాం. (ఆసనమును నిర్దేశించి) ఆసనమును బరిగ్రహింపుము.

రా. (ఆసనమును నిర్దేశించి) దేవి, యిందుగూర్చుండుము.

వాస. (భూమిమీదఁ గూర్చుండుచున్నది).

రా. నేఁగూడ భూమిమీదనే గూర్చుండెదను. (అనుచునట్లుసేసి) సఖీ ప్రసన్నవగుము. నేనెంత యనునయించినను గోపముడుగవేల.

చ॥ బొమముడి గానరాదు, భృశముంగనుదమ్ములునీటఁదోఁగు; వి
ద్రుమల లలితాధరంబుపయిఁ దోఁచదుకంపము, పరుసనూర్పు; లా
స్యముపయికెత్తు; వుత్తరమొసంగవు; చిత్తము తావుదప్పె; న
న్గమిలెడు నీదుకోపమిది గూఢశరక్షతివోలె నేర్చెడున్॥

అలుక వీడుము చెలీ.

వాస. అలుక యెవ్వరికి? వగచుచున్న నన్నిట్లేల నలయించెదవు.

సొం. మహారాజ ఈమె యుద్వేగకారణము వేరయున్నది.

రా. (సంభ్రమముతో) అదియేమదియేమి?

సొం. (చెవిలోఁజెప్పుచున్నది).

రా. (నవ్వి) ఇంతేనా? దీనికింత గావలెనా? ఇదినాకును దెలిసేయున్నది సర్వము సిద్ధమైనతరువాత సంతోషవార్తతో దేవికిపీనుల విందు సేయు నుద్దేశముతో నింతదనుక మిన్నకుంటెని. అట్లుగాక దృఢవర్మవిషయమున నేనుదాసీనుడుగా నుందునా? మొన్నగదా యక్కడి సమాచారమిట్లు దెలియవచ్చినది.

ఆ॥ మనబలంబు లొక్కమాఱుగఁ గవిసిత
త్సకలసైన్యములను జక్కుసేయ
నాకళింగహతకుఁ డద్రిదుర్గములోన
వరలు వరణమాత్రి శరణుఁడగుచు॥

కావున నోప్రియసఖీ వినుము.

చ॥ కరిఘటలెల్ల మ్రింద; రధికప్రకరంబును డించెసర్వము;
దురగపదాతివర్గములు ద్రుంగె; బలంబులువిచ్చిపారె; నెం
పరియరి శైలదుర్గమునఁ బ్రాణముతోడుత నున్నవాడు; ద
ద్వరణము గూలవ్రాలెడును వ్రాలికయుండిన బద్ధుఁడయ్యెడున్॥

సాం. రాజపుత్రీ, నేమొదటనేఁ జెప్పితిఁగదా, వత్సరాజు ఉపేక్షచేయఁడని

వాస. అట్లయిన నాకు సంతోషమయినది.

(ప్రతీహారి ప్రవేశించుచున్నది).

ప్రతీ. జయము స్వామీ, జయము. దృఢవర్మ కంచుకి సహితుండై యా నవంబున వికాసంబు దోప విజయసేనుండేదో సంతోషవార్త విన్నవింపవచ్చి ద్వారముననున్నవాఁడు.

వాస. (స్వగతముగా) ఆర్యపుత్రుని యనుగ్రహమువలన నామ మనోరథము సఫలమయ్యె నని యెంచెద.

సాం. నేవత్సరాజ పక్షపాతినింగాన మిన్నకుండెదను.

రా. వారల శీఘ్రమున గొనిరమ్ము.

ప్రతీ. దేవర చిత్తము (అని నిష్క్రమించుచున్నది.)

అంత విజయసేనుఁడును గంచుకియుఁ బ్రవేశించుచున్నారు).

విజ. ఓకంచుకీ, యిప్పుడు స్వామిదర్శన కౌతూహలంబున నామనంబెంతయు నలరుచున్నయది.

కంచు. దీననేమి యతిశయము ?

తే॥ గీ॥ స్వామి దర్శనమాత్రానఁ బ్రీతిజనుండు
నను పమంబైన సుఖమందు నెనఁగ, వేర
యేలయరిదళ విదళన సెల్లవేళఁ
బ్రభునియోగ మనుష్ఠించు వానిఁజెప్ప ?

ఉభయులును (సముఖంబునఁ జేరి) స్వామీ జయము.

రా. (ఉభయులను గాఁగలించుకొనుచున్నాఁడు).

కంచు. దేవి, దైవానుగ్రహమువలన ధన్యవైతివి.

ఆ॥ విజయసేనుఁ డడరి విక్రమంబునమించి
యిల కళింగపాలు నవనిపాలు
సేసి మాన్యపాలు సింహాసనంబున
నిల్పి తేని యాన నిర్వహించె॥

వాస. భగవతీ, యీకంచుకి నెఱుంగుదువా ?

సాం. ఎఱుంగకేమి ? ఈతనిచేత నేగదా మీపినతల్లి నీకునాడు బొమ్మల కంటి నంపినది ?

రా. మేలు, విజయసేనా, మేలు. మహాకార్యము నిర్వహించితివి.

విజ. (పాదములఁ బడుచున్నాఁడు).

రా. దేవీ, భగవదనుగ్రహమువలన ధన్యవైతివి. దృఢవర్మ రాజ్యమునఁ బ్రతిష్ఠింపం బడియె.

వాస. భవదనుగ్రహమువలన ధన్యనైతిని. ఆర్యపుత్రా, మంగళము నీకు.

విదూ. ఇట్టి యభ్యుదయావసరంబుల రాజాస్థానమున మూడు కార్యము లవశ్యాచరణీయములు. (రాజును నిర్దేశించి వీణావాదనము నటించుచు) గురుపూజయు (తన యజ్ఞోపవీతమును జూపుచు) బ్రాహ్మణ సత్కారంబును (ఆరణ్యకను సూచించుచు) సర్వబంధన మోక్షంబును.

రా. (వాసవదత్త నపవారించి, ఛోటికయొసంగి) మేలూ, వయస్యా, మేలు బాగుగఁజెప్పితివి.

విదూ. శ్రీమతీ, నీయుత్తరువున కెదురు సూచుచున్నాము.

వా. (సాంకృత్యాయనిం జూచి స్మితముతో) ఈతులువ యారణ్యకను విడిపించినాడు.

సాం. పాపమాపెను జెఱనుంచి యేమిప్రయోజనము ?

వాస. భగవతీ, నీకుంబోలినట్లు సేయుము.

సాం. అట్లయిన నేఁబోయి విడిచివచ్చెద (అని నిష్క్రమించుచున్నది.)

కంచు. మారాజు వత్సరాజున కెఱింగింపుమని చెప్పినమాటలు మఱియును గలవు తెలిపెద వినుండు.

సీ॥ ఘనబంధ మెడలించి కడగండ్లు దొలగించి, కరుణఁగాచినమాట మరువననుము
ఆలుబిడ్డలఁజేర్చి యంగరాజ్యముగూర్చి, యిలనిల్పుచేపేళఁ దలఁతుననుము
ఇపుడీవొసంగిన యీరాజ్యవిభవాదు లెల్ల నీయవెరుని యెంతుననుము ।
విసిగి వీడగనున్న యసువుల నిల్పితి, వీనినీయవిగ భావింతుననుము ।

గీ॥ నీకొసంగ దలంచిన నాకుమారి।
యల్ల ప్రియదర్శిక యదృశ్య యైనపంత।
ప్రీతి వాసవదత్తను బెండ్లియాడి।
యల్లుడై యీవుదీర్చినఁ జెల్లెనుము॥

రా. (లజ్జావనతవదనుండై యుండును).

విజ. ధృఢవర్మను దేవరయెడంగల ప్రీతి వర్ణింపనలవికాదు.

వాస. (కన్నులనీరునింపుచు) ఓయార్య, కంచుకీ, ఏమీ నాచెలియలు దప్పిపోయినదా ?

కంచు. రాజపుత్రి, కళింగసేనలు చుట్టుముట్టిన నంతఃపురంబెల్ల సంక్షోభించె. అప్పుడు ప్రియదర్శిక నాకన్నులంబడిన నందుండఁ దగదని యామెందోడ్కొని వత్సరాజాంతికమునకు బయలువెడలి, వచ్చునెడ వింధ్యకేతు నికేతనంబున విడిచి, యామెనటనిల్పి నేను స్నానార్థమరిగి మరలునంతకు వింధ్యకేతు సహితముగా వింధ్యకేతు నాస్థానము వైరులచే స్మరణీయావస్థ నొందింపఁబడెను.

రా. (సస్మితముగా) విజయసేనా, ఆమెయెవ్వరో యూహింపఁగలవా ?

కంచు. ఆచ్చట నెచ్చోవెదకినను రాజపుత్రింగాననైతి నాటినుండి నేటివరకు నాపెజాడయే గానరాకున్నయది.

(అంతట మనోరమ ప్రవేశించుచున్నది)

మనో. దేవి, పాపమాపె ప్రాణసంశయావస్థలో నున్నయది.

వాస. ఆపె యెవరు ? ప్రియదర్శికమాట చెప్పుచుంటివా ?

మనో. ప్రియదర్శికమాట నేనెఱుంగను. ఆరణ్యిక మత్తమని విషంబు ద్రెప్పించుకొని త్రావి ప్రాణ సంశయావస్థలో నున్నయది. కావున మీదేవి వెంట నే యామె రక్షణోపాయముఁ జింతింపుము. (అని యేడ్చుచుఁ బాదములపైఁబడుచున్నది)

వాస. (స్వగతముగా) అక్కటా ! ప్రియదర్శికాదుఃఖ మారణ్యికా దుఃఖమున మున్గిపైఁదోచకున్నది. లోకులు కాకులు. నాయందేమి యారోపింతురో

ఇప్పటికిది యుక్తముగాఁ దోఁచెడిని. (సంభ్రమముతోఁ బ్రకాశముగా) మనోరమా, నాగలోకమున కేగినపు డార్యపుత్రుఁడు విషవైద్యమును నేర్చివచ్చినాడు. కావున నారణ్యిక నిటకుఁ దోడ్కొనిరమ్ము.

(మనోరమ నిష్క్రమించుచున్నది).

(అంత మనోరమ భుజములపై కేలూది యారణ్యిక ప్రవేశించుచున్నది.)

ఆర. ఓసీ మనోరమా, నన్నేల యంధకారమున వైచితివి !

మనో. (విషాదముతో) అయ్యో ! విషము కండ్లకెక్కినది. వాసవదత్తను జూచి) దేవి, విషము వ్యాపించుచున్నది. రక్షింపుము రక్షింపుము.

వాస. (సంభ్రమముతో రాజు హస్తమునుబట్టి) ఆర్యపుత్రా, సత్వరముగ లెమ్ము. పాపమీపె యాపదఁ బాపుము.

(అందఱు చూచుచున్నారు.)

కంచు. (విలోకించి) ఈమె సరిగా మాప్రియదర్శిక రూపమును బుణికి పుచ్చుకొనినట్లున్నది. (వాసవదత్తవంకఁజూచి) రాజపుత్రి, ఈకన్య మీకెక్కడ నుండి వచ్చినది ?

వాస. ఆర్య, ఈపె వింధ్యకేతుని దుహిత. వింధ్యకేతుం దునిమి విజయసేనుఁ డీమెం దెచ్చినాఁడు.

కంచు. వానికిం గూతురెక్కడిది ? మా రాజపుత్రియే యీపె. అక్కటా యెంత మందభాగ్యుఁడనైతినిఁ (నేలసోలి లేచి) రాజపుత్రీ, ఈమె నీచెలియలు ప్రియదర్శిక ; మడియుచున్నది. ఉపేక్షింతువేల ?

వాస. ఆర్యపుత్ర, రక్షింపుము రక్షింపుము, నాచెలియలుసురుదొఱఁగుచున్నది.

రా. ఊరడిలు మూరడిలుము. చూచెదను (స్వగతముగా) అక్కటా యెట్టికష్టము వాటిల్లినది.

క॥ వనిఁ దిరిగి తిరిగి భ్రమరము
ఘన మకరందములు దొలకు కమలంబానం
జననది హిమహతిఁ బడెవిధి
యనుకూలముగాక ఫలములందునె వాంఛల్ ॥

(ప్రకాశముగా) మనోరమా, ఈపెను మహాలోకము [illegible] కనుంగొనుము.

మనో. చెలీ, లోకము దెలియుచున్నావా ? ([illegible]) చి) చెలీ, పలుకవేల లోకము దెలియుచున్నావా ? యని [illegible].

ప్రియ. (అవిస్పష్టముగా) ఈయవస్థలో నున్న నాకు మహారాజా [illegible] డడేల ? (ఇట్లుసగము చెప్పువరకు నేల గూలుచున్నది).

రా. (కన్నీరొలుక)

చ॥ చెలి ముకుళించుఁ గన్నుగవ, చీకటిపర్వెడు [illegible]
గలికికిఁ గంఠరోధమగు, నాకువచస్స్వరణంబు [illegible]
లలనకుశ్వాసలింకు, వెసవాతను వెంతయుఁ [illegible]
జెలినలమున్ప్రివంబు, ననుఁ జెందెను దుఃఖభరంబు [illegible]

వాస- (కన్నీరొలుక) అమ్మా ప్రియదర్శికా [illegible] ఇదె మహారాజు నీచెంత నున్నవాడు.

శా॥ అమ్మా నిన్నెఱుగంగ నేరమిఁగదా యాభంగి [illegible]
విమ్మాడ్కిం గనుమూయ న్యాయమటవే, యిందింపరా [illegible]
లెమ్మా నీవిటఁ గన్నుమూసిని నికుల్నిందుం [illegible]
దమ్ముల్మోడ్చినఁ జీకటుల్ గవియుచందంబొప్ప [illegible]

హాదైవమా నేజేసిన యపరాధమేమి ? మాప్రియదర్శిక [illegible] (ప్రియదర్శికపై కొఱిగి కన్నీరు దొలగించుచున్నది).

విదూ. వయస్యా, నీవేల కర్తవ్యతా విమూఢుండవై [illegible] ! [illegible] విషాదమునకుం గాలమా ? విషగతి యెంతయు విషమము, గావున [illegible] ద్యాపరిభావమును జూపుడు.

రా. ఔనౌను ఇంతదనుక నేను వ్యామోహమునకే [illegible]. (ప్రియదర్శికనుజూచి) ఇదిగో యీపెను జీవింపఁజేసెద. జలము, జలము.

విదూ. (నిష్క్రమించి మఱల ప్రవేశించి) ఇదిగో జలము.

రా. (జలోపస్పర్శనము సేసి, ప్రియదర్శికపై హస్తముంచి, [illegible]

ము నటించుచున్నాడు).

ప్రియ. (మెల్లగా లేచుచున్నది).

వాస. ఆహా! నాయదృష్టము, నాచెలియలు పునర్జన్మమునందినది.

విజ. ఏమీ మహారాజు విద్యా ప్రభావము.

కంచు. మహారాజా, నీవు సర్వథా నరేంద్రుడవే కదా.

ప్రియ. (మెల్లమెల్లగా లేచి కూర్చుండి యావులించుచు, నవిస్పష్టముగా) మనోరమా, చాలసేపు నిద్దురవోయితిని.

విదూ. వయస్యా, ఇప్పుడుగదా నీమంత్రివాదిత్వము నిరూఢమయినది.

ప్రియ. (సాభిలాషముగా రాజును నిర్దేశించి, లజ్జతో మోమువాంచుచున్నది)

వాస. ఆర్యపుత్ర, విషవేగ మిప్పటికిని దగ్గనట్లున్న దేల ?

రా. (సస్మితముగా)

ఉ॥ కన్నులు బూర్వశోభిని వికాసము నొందవు, మాటలందునన్
దిన్నదనంబు దోచదు, జనించెడుఁ జెమ్మటఁదోగుఁబుల్కలన్
జెన్నుదొఱంగి యున్నయది నిద్దపు మేను, వడంకు వ్రేగునన్
సన్నని కౌనుదూలెడు, విషంబఖిలంబు శమింప దింతికిన్ ॥

కంచు. (ప్రియదర్శికనుజూచి) రాజపుత్రి, ఇదె నీతండ్రి యాజ్ఞాకరుఁడు ప్రణామము సేయుచున్నాడు. (ప్రణామము చేయుచున్నాడు.)

ప్రియ. (విలోకించి) ఓహో, ఆర్య, వినయవసుండవా? (కన్నీరొలుక) హా తండ్రీ! హా తల్లీ!

కంచు. అమ్మా, వగవంబనిలేదు; వత్సరాజ ప్రభావంబున నీతలిదండ్రులు కుశలులై యున్నవారు.

వాస. (కన్నులనీరుగ్రమ్మ) ఓసీ యలీకశీలా, ఇప్పుడైనను భగినీస్నేహము ను గనుపఱచవేల? (కంఠమున గౌఁగలించుకొని) హా! యిప్పుడుగదా, నాకూరట గల్గినది.

విదూ. చెలియలిం గౌఁగలించి సంతోషించుచుంటివే కాని, వైద్యుని పారి

తోషికమును మఱచితివి గదా.

వాస. వసంతకా, మఱువలేదు (సస్మితముగా రాజును నిర్దేశించుచు) ఆర్య పుత్రా, కేలిట్లుసాచుము.

రా. (కేలు సాచుచున్నాఁడు)

వాస. (ప్రియదర్శిక కేలందుఁ గదియించుచున్నది).

రా. (హస్తము వెనుకకుందిగిచి) ఇప్పుడేగద నిన్నొకదానిని పరిగ్రహింపఁ జేయగడఁగితిని. మరలనిదియేల?

వాస. ప్రత్యాఖ్యానముసేయ నీవెట్లు జాలుదువు? ప్రథమముననే నా నాతండ్రి యీమెనీకిచ్చినది.

విదూ. ఓయీ దేవిని మన్నింపవలయును గదా. ఆమెమాట కష్టము సెప్పకుము.

వాస. (రాజుహస్తము బలిమిందిగిచి ప్రియదర్శిక హస్తమందిడుచున్నది).

రా. దేవి మాటదాట మాకేటి యధికారము.

వాస. ఆర్యపుత్ర, యింకనుం బ్రియంబుండు సేనిఁ గోరుము.

రా. చ॥ మునుపటియట్ల రాజ్యమున మోదముతో దృఢవర్మయున్న వా।
డనయముఁ గోపవేగమునఁ నాత్మఁగలంగి ప్రసన్నవైతివి।
వనుజయు నిన్నుఁగూడెఁ దనప్రాణభయంబు దొలంగి, యింతి, యిం।
కనుభువిఁ గోరగాఁడగినకార్యము గల్గునె? యైనఁజెప్పెదన్॥

( భ ర త వా క్య ము. )

ఉ॥ వానలుమెండుగాఁగురిసి వాసవుఁడీవుత సస్యసంపదల్
పూనిసురాళిఁ దన్పుతను భూసురవర్గము హవ్యసంతతిన్
మానిత సాధుసంగతి ఘనంబుగనిల్చెడుఁ గాతనిచ్చలున్
పేనశియించుతం బ్రతినివిష్ట ముఖోద్ధమ్యపాపవాదముల్॥

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

చతుర్థాంకము ముగిసినది.

